# వివాహం

(నవల)

చలం




వాహినీ పబ్లిషింగ్ హౌస్
విజయవాడ-2.

# ప్రకాశిక

శ్రీ చలంగారి యీ రచనను గురించి మేము పరిచయము చేయ బూనుట చంద్రునకో నూలుపోగుచందమే. శ్రీ చలంగారు ప్రస్తుతం "అరుణాచలంలో శ్రీ రమణ మహర్షి నెలకొల్పిన ఆశ్రమములో" నున్నారు. ఈ నవల వారి పూర్వాశ్రమములో వ్రాయబడినది.

సంఘములోని విభిన్న వ్యక్తులయొక్క భిన్న ప్రకృతే యిందలి యితివృత్తము.

ఇట్లు,
ప్రకాశకులు.

# వివాహం

తమ్ముడు రామ్మూర్తి చచ్చిపోయినాడని వినగానే డిప్టీకలెక్టరు వెంకన్నగారి మనసుకి చాలా విశ్రాంతి కలిగింది. గాని, రామ్మూర్తి సంసారానికి దిక్కు లేకపోవడమూ, తనే బాధ్యత వహించితీరాలి కొంతకాలమన్నా అనే సందేహమూ అతని కా చావు పూర్తిగా రుచించకుండా చేశాయి. చిన్నప్పణ్ణించి రామ్మూర్తి పెంకివాడు. తన మనసుకి తోచాయనే గాని, తనుచేసే పనులవల్ల చుట్టుపక్కల వాళ్ళకి యేం కష్టం కలుగుతుందో అని ఆలోచించే మనిషి కాడు.

రామ్మూర్తి స్వతంత్రవ్యక్తి కావడానికి వీల్లేదనీ, గడియారంలో చక్రంవలె సంఘంలో భాగమనీ, స్వాతంత్రమని పేరుపెట్టి, తక్కిన చక్రాలకి ఎదురు తిరగడానికి హక్కు లేదనీ, ఎన్ని సంగతులు వెంకన్న పంతులు చెప్పినా విన్నాడు కాడు. దానికితోడు అతనికి సంఘసంస్కరణం పిచ్చిపట్టిం తరవాత "ఇంపాసిబిల్" అయినాడు. అతను తన తమ్ముడని చెప్పుకోడమే నామర్దాగా వుండేది, మర్యాదస్తుడు వెంకన్న పంతులుకి.

రామ్మూర్తికి ఏం సంస్కరణ చేద్దామా అనే విచారం కలిగింది. వితంతూ వివాహం చేయ్యాలంటే ముసలితల్లి నెవరూ పెళ్ళిచేసుకునేట్లు లేరు. ఆ కావలెవరూ చచ్చి చెల్లెళ్లు వితంతువులు కాలేదు. కూతురికింకా పెళ్ళే కాలేదు.

కనక వితెంతూ వివాహ సంస్కరణం లాభంలేదనీ, రజస్వలా నంతర వివాహం పట్టుపట్టాడు. అతని కూతురు రవణకి పద మూడేళ్లు వొచ్చాయి. రజస్వల అయిందనే అందరి నమ్మకమూ. కాకపోయినా, అయిందనే నమ్మకం పుట్టించేవాడు అతను.

"చూడండి. మాఅమ్మాయి పెద్దమనిషి అయినా..."

పెళ్ళి చేయుననో, పెళ్ళి చెయ్యలేదనో యేమనేవాడో యెవరూ సరిగా వినలేదు. రవణకి పదేళ్ళు దాటగానే వెంకన్న పంతులు రామ్మూర్తితో భోజన సంబంధం మానేశాడు. మానేసినట్లు పైలైనంతవరకు తెలిసిన వాళ్ళందరితోటీ చాటించాడు, తెలీనవాళ్ళముందు తనకు తమ్ముడు లేనట్లే ప్రవర్తించాడు. ఆంధ్రపత్రికలో ప్రకటించేవాడే, కాని యీ ప్రకటనకి అవసరమేమైయుండునా అని కొందరు సందేహిస్తే రవి భయమేసింది. తమ్ముడు సంఘసంస్కర్త కాకముందు అప్పుడు వెంకన్న పంతులుకి కొంచెం అనాచారం ముండేది. ఇప్పుడు "క్రాఫు" గొరిగించాడు. తలగుడ్డ చుట్టినా పిలక కొంచెంగా కిందికి దిగజార్చాడు; బొట్టు పెద్దదయింది.

"ఇప్పుడే జపంనించి లేచానండీ" అంటాడు అనేక మందితో.

తనమీద కసికొద్దీ రామ్మూర్తి చచ్చాడు.

అరవై రూపాయల జీతంలో వున్న రామ్మూర్తి యేదీ ఆదా చెయ్యలేదు. అనాథలయిన ఆ తల్లీకూతురూ ఏమౌతారిప్పుడు !

సంస్కరణానికి పూనుకున్న యోధుడు అదేదో కొస ముట్టిందాక చూచిపోక, యీ ప్రకారం సంసారాన్ని, సంస్కరణానికి అమ్ముపోసిన కూతుర్ని నిర్లక్ష్యంగా వొదిలిపెట్టి, సుఖంగా బతుకుతున్న తనకీ, తన కుటుంబానికీ తన మామగారి ఆచారానికీ యింత ఆపత్తు కలిగించడానికి రామ్మూర్తి కేమి హక్కువుందని వెంకన్న పంతులికి కోపమొచ్చింది ఒకసారి కనపడితే యివన్నీ తమ్ముడితో "అర్గ్యూ" చేసి వుండును.

రామ్మూర్తి భార్యనీ, కూతుర్నీ, వాళ్ళగతికి వాళ్ళని వొదిలేసి చక్కా వెళ్ళిపోయాడు. దేవుడేవున్నాడు గతిలేని వాళ్ళకి, అంటే తక్కువ అపవాదా, ఆచారం లేనివాళ్ళని తన యింట్లో పెట్టుకొని పోషిస్తే తక్కువ అపవాదా, అని ఆలోచించాడు పంతులు. తమ్ముడికే కాని కూతురికీ, భార్యకీ సంస్కరణాభిలాష వుండదు కదా? వాళ్ళని పూర్వాచారంలో కలిపేసుకోవచ్చు. కాని, ఆ పిల్ల రజస్వలయిందనుకుంటున్నారే? వెంకన్న పంతులికి పెళ్ళికావలసిన కూతురుంటే యిన్ని జిజ్ఞాసలే రాకపోను. ఆ ఆపద లేకున్నానే యీ వ్యాకులాటు. కాని యెట్లాగేనా కొన్ని దురూహాలు తప్పవు. తనని గురించి అంత మంచి అభిప్రాయంగల తన మామగారేమంటారు?

ఇరవై యేళ్ళక్రిందట పెండ్లినాడు వెండిచెంబులో పంచపాత్ర యిస్తానని యింకా ఇవ్వలేదని మొన్ననే ఆ మామగారిని బూతులు తిట్టాడు. కాని, ఈ విషయంలో ఆయన తన

కిచ్చే గౌరవాన్ని పోగొట్టుకో తలుచుకోలేదు. ఎంత అనుభవంమీద ఆయన సనాతనమార్గాన్ని త్రొక్కి ధన్యుడైనాడో కదా ! తనా అనాచారంలో ప్రవేశించి, పాపం ముసలివాడు తన భార్య తండ్రి. ఆయన అవసానదశలో కష్టం కలిగించేది- అదిగాక ఈ కాలంలో తమ్ముడి దిక్కులేని సంసారాన్ని భరించలేదని ఆగ్రహించే దెవడు ? రజస్వలైనట్టు అనుమానమున్న పిల్లని యింటో పెట్టుకున్నాడని వెలివేసేవాడే కాని ! వాళ్ళు అడుక్కుతింటే యెవరికేం, భ్రష్టులైపోతే యెవరికేం ? పైగా నీకుమాత్ర మెందుకంటారు, జాలిపడి సహాయం చేసేవాణ్ణి. తమ్ముడి కర్మ యెవరు చేస్తారు ? తనే చెయ్యాలి. ఈ విషయంలో ప్రపంచం తనను క్షమించదు. ఇంటిపక్కనున్న పురుషోత్తమ శాస్త్రుల్లూ, సంస్కర్తలందరికీ ఆదర్శ పురుషుడు వెంకటశివుడూ అందరూవొచ్చి, తక్కిన విషయాలెట్లావున్నా తమ్ముడి కర్మమాత్రం తను చేసితీరాలన్నారు. సంస్కర్త అయితేమాత్రం రామ్మూర్తికి పుణ్యలోకాలక్కర్లేదా ? శాస్త్రప్రకారం అన్నకర్మ చేసితీరాలిమరి. రామ్మూర్తి ప్రేతాన్ని అన్న వెంకన్న, పితృలోకాలవరకూ నెడితే, తరవాత ఆ లోకంలో పితృదేవతలు దాన్నేమన్నా చేసుకోనీ, వాళ్ళగోల వాళ్ళదీ !

## ౨

సెలవు తీసుకుని తమ్ముడివూరికి వెళ్లి కర్మ ముగించి మర్నాడు ప్రయాణమన్నాడు. వెంకన్నపంతులు వొచ్చినప్పణ్నించీ, మరదలూ, కూతురూ, అతను తమను తీసుకుపోవడానికి వొచ్చినట్టే తలచుకొని అట్లానే మాట్లాడుతున్నారు. వాళ్ళని తీసుకుపోవని చెప్పేసమయం అతనికి దొరకనేలేదు. అతనితో వారాప్రశ్న రాని స్తేనా ? ఊరికి వెళ్ళేట్టే అన్ని యేర్పాట్లూ చేయించారు. అందరితోనూ, మా పెద్దనాన్న వొచ్చారు వాళ్లవూరు వెడుతున్నామంది రవణ ! ఆ వూరి పెద్దమనుష్యులూ, సంస్కర్తలూ, హెడ్మాష్టరు పూర్ణానందం గారూ, తాసిల్దారు రామకృష్ణయ్యా అందరూ అతన్ని చూడవచ్చి యీ సంసారభారం వహిస్తున్నందుకు వెంకన్న పంతుల్ని అభినందిస్తో మాట్లాడారు. రామ్మూర్తిని అద్భుతంగా పొగిడారు. స్కూలు పిల్లలువచ్చారు. సామానంతా చిటికెలో సర్దేశారు. బళ్ళు పిలుచుకొచ్చి యెక్కించారు.

"బాబాయ్ ! ఈ సామానంతా ప్యాసంజరులో తీసికెడితే చాలా ఖరీదవుతుంది. గుడ్సులో వేయిస్తా"నని.

ఆగక వెళ్ళిపోయింది రవణ. తను రవణవెనక పరిగెత్తికెళ్ళి "వీల్లేదు నేను మిమ్మల్ని తీసుకొనిపోవటంలే"దని యెట్లా అంటాడు వెంకన్నపంతులు ! యెదుట నిలబడివున్న శిరస్తాదారుని చీవాట్లు వెయ్యడం, గుమాస్తా శెలవ అడిగితే వీల్లేదనటం నేర్చుకున్నాడు గాని, తండ్రిపోయి యేడ్చే అన

పిల్లవెనక పరుగెత్తి మరీ యేడిపించే ధైర్యమెక్కడ నేర్చుకున్నాడతను !

తను 'టీచరుగారి' సంగతి వచ్చినప్పుడల్లా, ఆయన ఫోటో, ఆయన దస్తూరీతో కాయితం కనబడ్డప్పుడల్లా ఆ కుర్రాళ్ళ యేడుపులు విచిత్రం ! రవణ వాళ్ళని ఓదార్చడం! ఇదో కొత్తలోకంలాగుంది వెంకన్న పంతులుకి. సంస్కారం యిష్టంలేని లోకమంతా కలిసి యేవిధానో రామ్మూర్తిని చంపినట్లు మాట్లాడుకుంటున్నారు వారందరూ. అందులో రామ్మూర్తి బంధువులు అందులో చాలా దగ్గరవాళ్ళు, బాధ్యతకలవారు అందులో ముఖ్యంగా ఒకరు, అతని చావుకు కారణమైనట్లు వాళ్ళంటున్నట్లు తోచింది వెంకన్న పంతులికి. పోనీ అట్లా వూరికే యీడవకపోతే వాళ్ళల్లో యెవరో యిద్దరు కుర్రాళ్ళు, తల్లినీ కూతుర్నీ కట్టుకుని నితంతు రజస్వలానంతర వివాహ సంస్కరణాన్ని సఫలపరచి, పోయిన గురూపదేశ ఋణం తీర్చుకోకూడదా, తనకీ అవస్త తప్పిపోనే అనిపించింది పంతులికి.

ఏమైతేనేం తన ప్రయత్నం రవ్వంత లేకుండానే బుధవారం సాయంత్రం తల్లీకూతుర్లతోసహా గంటకి ముప్పైమైళ్ళ వేగంతో తన వూరివేపు ఎగిరిపోతున్నాడు. కరణాల డొక్కలు చీల్చడానికి ప్రసిద్ధికెక్కిన డిప్టీకలెక్టరు. చెట్లలోంచి కనపడే గుడి గాలిగోపురం వెనక సూర్యుడస్తమిస్తున్నాడు. రైలు గేటు దగ్గిర ఆవుపెయ్యలు తోకలెత్తుకొని చెదరి పరిగెత్తాయి. పచ్చ పైర్లమీద శాంతవస్త్రాన్ని కప్పింది సంజ. వెంకన్నగారి మన

సులో కలవరపు టాలోచనలు విజృంభించాయి. ఈ తల్లినీ కూతుర్నీ వెంటపెట్టుకెళ్ళి తన యింటిగుమ్మంలో దిగగానే, భార్య యేమంటుందో, యేంచేస్తుందో అని ఆలోచించాడు. తన కచేరికి వొచ్చేకరణాలు, ప్లీడర్లూ, గుమాస్తాలూ, వీళ్ళందరి స్వభావం-ముఖం చూడగానే కనిపెట్టి మరునిమిషం యేం మాట్లాడుతారో యెట్లా ప్రవర్తిస్తారో తెలుసుకోవడంలో నేర్పరితనం వహించగలిగాడుగాని, యిన్నేళ్ళు కలిసి కాపరం చేస్తున్నా, భార్య రామమ్మ యే నిమషాన యేమంటుందో, యేం చేస్తుందో యెందుకు చేస్తుందో రవ్వంతకూడా నిర్ణయించ లేడు. తను చంగావి పంచలు మానేసి కలకత్తా అంచు పంచెలు కట్టినందుకుగాని, మధ్యాన్నం కాఫీమాని 'టీ' తాగినందుకుగాని యే కారణంవల్లనైనా ఆమె తటాలున బావిలో పడ్డా, అతనికేమీ ఆశ్చర్యం కలగదు. కాని పూర్వానుభవాన్ని పట్టి ఆమె మూడువిధాలైన ఆచరణలు అమలులో పెట్టవొచ్చు, యీ విషయంలోనని అనుకున్నాడు. మొదటిది - వీళ్ళని చూడగానే పెద్దగా అరిచి వాళ్ళు యింటోంచి వెళ్ళిందాకా తను ఒక్క నిమిషం విశ్రాంతి పుచ్చుకోడంగాని, యితరుల్ని పుచ్చుకోనివ్వడంగాని లేకుండా వీలయినశబ్దం చెయ్యడం; తన కష్టం తొలిగిందాకా చుట్టుపక్కల వాళ్ళందరికీ, ముఖ్యం భూలోకదైవం తనభర్త వెంకన్న పంతులుకీ, తరువాత ప్రియమైన పిల్లలకీ, అమితమైన కష్టం కలిగించే సామర్థ్యం ఆమె కతీతంగా వుంది.

రెండోది - వీళ్ళు వొచ్చారని తెలియగానే ముసుగు పెట్టి, ఒక్క ఆహారానికి తప్ప, యింక అన్నిటికీ నిర్జీవమై

పడుకుని వుండడం. మూడోది-తన కోపాన్నంతా దిగమింగి, యీ కొత్తవారికి మర్యాదా ప్రేమా కనపరచడం. ఈ మూడోది సక్రుతమూ, తాత్కాలికమూను. ఈ మూడో పద్ధతి పన్నిందా వెంకన్నపంతులికి సంతోషం యేమీ లేదు అసలు వడ్డీతో కూడా తుపాను త్వరలోనే బద్దలౌతుంది. తనగుమ్మంలో బండి చప్పుడు కాకుండా దిగడం, వణుకుతున్న వేళ్ళతో ముందుగానే బండివాడికి డబ్బులు ఒక అణా ఎక్కువగా యివ్వడం, ముందు తను వసారాలోనికి నడవడం, దీపం చీకట్లో తన వీపు వెనకాల వీళ్లు నుంచోడం, బండివాడు సామాను తీసుకొచ్చి లోపల... చప్పున వెంకన్నగారి గుండెలు కొట్టుకోడం ఆగాయి. తనట్రంకు తోలుట్రంకు, కొత్తది అది యేమయింది? రైల్లో వచ్చిందా? దాన్ని చూసి మూణ్నెల్లయినట్టుంది. దాన్ని, తన మంచి ట్రంకుని యెట్లా మరిచిపోయినాడు! యీ పాడుగోలల్లో మతే తోచడం లేదు. బట్టలు మార్చుకున్నాడు, డబ్బు తీశాడు. టిక్కెట్టు కొన్నాడు, కాని ట్రంకు చూసిన జ్ఞాపకం లేదు. జేబులో తాళంచెవి లేదు. రైలుపెట్టె చుట్టూ చూశాడు. ఎక్కడా కనపళ్ళేదు.

"ఏమిటి, బాబాయ్, వెతుక్కుంటున్నావు?"

ఈ దవణ, తన సొంతకూతురై, ఒక్క నిమిషం తనని విడిచి వుండనంత చనువైనట్టు మాట్లాడుతుంది. స్వభావమూ, యెత్తా! ఆ పిల్లని చూసినకొద్దీ అతని కాశ్చర్యంగావుంది. తండ్రిపోయిన దిగులేమీ కనిపించదు పదమూడేళ్ళకీ చాలా

భారీవాళ్లు. యిదో దుర్లక్షణం. పెద్దది కాలేదంటే చూశే వాళ్ళు నమ్ముతారా! యీ అమ్మాయి స్వభావంకూడా. నీచమైనదిగా కనపడుతోంది. ఆ బడిపిల్లలతో చనువూ. బండివాడితో, స్టేషన్‌నౌకర్లతో చొరవా, సిగ్గు అసలు లేకపోవడం, యివన్నీ పంతులికి వెగటుగా తోచాయి. టిక్కెట్ కలెక్టర్ని బుజంమీద చెయ్యేసి వూయించి,

"వెంకటేశ్వర్లుగారూ మేము వెళ్లిపోతున్నాం. మా బాబాయి మమ్మల్ని తీసికెడుతున్నా"రంది.

ఇప్పుడామూల సాలెవాడితో బట్టలు నెయ్యడం; స్వదేశీ, పరదేశీ; లాభం, నష్టం, యేమిటో మాట్లాడుతోంది గంటనించి వాడితో వెళ్ళిపోరాదూ, తన నిట్లా యేడిపించక పోతే.........

"ఏంలేదు! ఏంలేదు...నా పెట్టె......"

చిరునవ్వుతో "వుంది బాబాయ్!...మన సామాను లోనే వచ్చింది, నీకేమన్నా కావాలా దాంట్లో!" అంది రవణ—

ఉందా! ఎక్కడ? తాళం లేనుగా మూత యెట్లా వస్తుంది? తనకేం కావాలి?

తనకేం కావాలనాలి? ఆలోచించాడు.

"పుస్తకం కావాలి."

"మూడు పుస్తకాలున్నాయి. ఏది కావాలి?"

"జ్ఞాపకంలేదు చూడనీ."

"రైనాల్డ్సు, మేరీ క్రైస్, రవిన్యూ ఎడ్మినిస్ట్రేషన్, సత్యం-శివం-సుందరం. యేది కావాలి?"

పెట్టె తెరవకుండా చెప్పేసింది యీ పేర్లన్నీ, తను రోజూ వుచ్ఛరించేవాటివలె. ఎట్లా తెలుసు! అందులో "సత్యం-శివం-సుందరం" తన దగ్గిరవుందని రమణకి తెలీడం ఆయనకి సిగ్గేసింది. అదేదో కొత్తరకం పుస్తకమని రైల్లో ఎవరో సగం ఖరీదుకి అంటకట్టారు. రెండు పేజీలు చదివేటప్పటికే, యెవరన్నా చూస్తారని భయమేసి వొదల్లేక వొదల్లేక, పెట్టెలో దాచాడు.

రమణ వాళ్లయిల్లు చేరుకున్నాక ఆపుస్తకం మళ్ళీ తీశాడు. చదవడం తప్పనుకున్నాడు. కాని తమ్ముడుపోయిన దుఃఖం-మరి ఏదో వొకటి చదివితేగాని పోదుకదా. తీరా కొన్నది చదివితేనేం! యీ లోకంలో యెటువంటి దుర్మార్గపు కవులు వుంటారో తెలుస్తుంది, అని రాత్రి వొంటిగంట దాకా చదివి చివరిపేజీవరకూ ముగించి, నిట్టూర్పు విడిచి. రెండుగంటలదాకా. ఆపుస్తకం వ్రాసినవాణ్ణి తిట్టుకుని పడుకున్నాడు. కాని ఎంత తిట్టినా ఆ పుస్తకంమీద కోపం చల్లారలేదు. నిద్రపట్టలేదు.

తను దేనికోసం తన జన్మని ధారపోస్తున్నాడో ఆ మర్యాదనీ, సంసారసుఖాన్నీ. ఆ పుస్తకం వ్రాసినవాడు వెక్కిరించాడనీ. ఆ వెక్కిరింపుకి కారణముందేమోననీ, వుగ్రకోపం కలుగుతోంది. ఒక్కసారి ఆ గాడిద కనబడితే! పేరూ ప్రతిష్ఠాలేని వెధవయి వుంటాడు. పేరున్నవాళ్ళనిచూసి

కడుపుమంటకొద్దీ వ్రాశాడు. ఇట్లాంటి పుస్తకాలు అచ్చు వెయ్యనీయడమే బుద్ధితక్కువ. ఏ 'సెక్షన్' క్రిందా దీన్ని నిర్మూలం చెయ్యడానికి వీల్లేదా! కాని వాడుకలేక ఆ 'క్రిమినల్ లా' ఆభాగం బూజుపట్టి జ్ఞాపకం రాలేదు. పత్రికలకు వ్రాస్తే! ఈయనకి కోపమెందుకని యోచిస్తారు. పోనిద్దూ! ఎవరిఖర్మం వాళ్ళది - వాడి పాపం వాడే అనుభవిస్తాడు. తన కెందుకు!

డబ్బుపెట్టి కొన్నపుస్తకం ఎంత చెత్తదైన, పారెయ్యడానికి చేతులురాక దగ్గుమందు పొట్లాలకన్నా అక్కరకొస్తుందని, పెట్టెలో వేసి వుంచాడు. అది రమణ తీసి చదవలేదుకదా! ఆడపిల్ల చదివితే ఇంకేమన్నావుందా! అది పాడైతే పాడయింది, తన సంసారాన్ని, తనకిపుట్టబోయ్యే కూతుర్ని ముప్పైయేళ్ళ తన భార్యని-ఛీ, తనభార్యని పాడుచేసేదేమిటి! ఏమో! ఏం చెయ్యగలం! మొన్న భారతిలో ఆ సినీమా నటకుని-చూసి చూసి ఆమె .... కాని ఆమె ఉబలాటపడితేనేం! ఆమెనెవరు పరిగ్రహిస్తారు, కళ్ళారచూసి! అతని గుండె నిబ్బరపడ్డది! కాని అది లేచిపోతేనేం! ఎవరినన్నా కొత్తగా చిన్నపిల్లని తను వివాహమాడ వొచ్చుగా-ఈగనా యీడు దాన్ని! కాని అప్రదిష్ఠ! తన ఆలోచనలు చూసి తనే నవ్వుకున్నాడు —— ఆ పాడు పుస్తకం చదవడంవల్ల వొచ్చాయి యీతుచ్ఛమైన ఆలోచనలు! వీటిని తగలెయ్య!

తన చేతులో కుడుతూవున్న షర్టుని పక్కనపెట్టి రమణ లేచి బొడ్డులో చీరె తడుముకుంటోంది. తన షర్టుని గుర్తుపట్టాడు పంతులు.

"ఆ... పట్టు... యేం... చేస్తున్నావు ?"

"ఇట్లాంటి పట్టు తెచ్చుకున్నావేం బాబాయ్, పెద్దమ్మ యేం చేస్తుంది ప్రొద్దస్తమానం ! వంటమనిషి కూడా వున్న ట్టుంది... యీ చేతులు - యీ మెడా చూడు. పోనీ నీ సామాను సర్ది పంపేస్తానన్నా చూడలా ?"

మొలలోంచి తాళంచెవి తీసి, బల్లకిందనుంచి కొత్త తోలు పెట్టెని బైటకిలాగి మూత తెరిచింది. లోపల సామానుని గుర్తుపట్టలేకపోయినాడు, వెంకన్న పంతులు అంతా. యేవస్తువ అక్కడ సర్దివుంది. తను చిన్నప్పటినించి వుపయోగించుకుంటున్న పెట్టెవలె, దానివంక చూడకుండానే చెయ్యి లోపలపెట్టి రవణ పుస్తకాన్ని సులభంగా పైకి తీసింది.

"యీ 'సత్యం-శివం-సుందరం' చదువు బాబాయి, చాలా బావుంటుంది"

"నీ కెట్లా... తెలుసు ? నువ్వు... చదువలేవు కద! "

"చదివాను నాన్నకి చదివేదాన్ని కూడాను ? యీ యన రాసిన 'దైవమిచ్చిన భార్య !' చదివారా ? నాదగ్గిర వుంది యిస్తాను. యింకా పుస్తకాలు రాశారు — యేవేవో... ఒకసారి ఆయన్ని నాన్నయింటికి పిలుచుకొచ్చారు కూడాను... నాన్నకీ, ఆయనికీ చాలా చర్చ జరిగింది. ఆవాళ ఆఖరికి 'టీ' నీళ్ళతో యిద్దరూ చల్లబడ్డారు "

"దైవమిచ్చిన భార్య ! అంటే?"

"పుస్తకం పేరు "

"సరేలే, దైవమివ్వడ మేమిటి?"

"అంటే సాధారణంగా యీపెళ్ళిళ్ళల్లో మనుషులు కడతారు, భార్యల్ని. కాని అతనికి దైవం వుద్దేశించిన భార్య యింకోత్తె వుంటుంది"

"మనుషులు మాత్రం దైవంఆజ్ఞకిమీరి భార్యల్ని కట్టగలరా యేమిటి? యెవరి పూర్వజన్మ సుకృతంకొద్దీ వారికి తగిన భార్యలు దొరుకుతారు."

"ఆయన అనేది అట్లాకాదు."

"ఎట్లా? దైవమిచ్చిన భార్య కనబడగానే, ఈ మనుష్యులు కట్టిన భార్యని వొదిలెయ్యమనేరా?"

"అట్లాకాదు బాబాయ్. ఆయన సంగతి నీకేం తెలీను. విను. అసలు కథ మొదలేమంటే. ఒకవూళ్ళో..."

వెంకన్న పంతులు వినడంలేదు. ఇట్లాంటి పుస్తకాలన్నీ చదివిన యీ రవణని యింటో భరించడం యెట్లానా అని?...

ఇంటికి వెళ్ళేటప్పటికి, రామమ్మ మూడోపద్ధతి ప్రకారం ప్రవర్తించింది; యింటో ఆమె మేనమామ దిగివుండడంచేత ఐవ్రుండవచ్చు ననుకున్నాడు వెంకన్నపంతులు. ఆ మేనమామ, వెంకట్రావు, జిల్లా జడ్జి. ఆయన్నీ, ఆయన కుటుంబాన్నీ చూస్తే, రామమ్మకి అమితమైన గౌరవం. తన కుటుంబంకూడా అంతగొప్పదేనని ఆయనకీ, లోకానికి తెలపడానికి ప్రయత్నిస్తుంది ఆమె. వెంకట్రావుకి సంఘసంస్కరణాభిలాష హెచ్చు. వెంకన్న...

వెంకట్రావు సమయానుకూలమైన రాకకి ఆయన్ని యెంతో హృదయంలో స్తుతించుకుంటో, రైలుబడలికవల్ల చాలా అలిసి వున్నానని భోజనందగ్గిర సూచించి, రామమ్మ గది లోకి రాకముందే దీర్ఘంగా గుర్రుకొడుతున్నాడు

రవణకి సంబంధం వొకటి వుందని వెంకట్రావుగారు చెప్పారు. మర్నాడు. ఒక బీదకుర్రవాడికి ఆయన చదువు చెప్పిస్తున్నాడు తల్లి ఆయన యింటో వంటచేస్తుంది. ఆకుర్రవాడు బుద్ధిమంతుడూ, తెలివికలవాడూ. కట్నం లేకుండా యీ పిల్ల నతనికి పెళ్ళిచేస్తాననీ, కాని ఆగోపాలరావు చదువుబాధ్యత వెంకన్నపంతులు భరించాలనీ అన్నాడు ఆయన. వెంకన్నపంతులికి అసలీ రిఫారంపిల్లని ఎవరు పెళ్ళి చేసుకుంటారా అని భయంగా వుంది గనుక, యీ సంబంధం చాలాసంతోషంగానేవుంది. కాని ఆపెళ్ళితో ఈపిల్ల వొదిలి పోక. ఆ కుర్రాడితోకూడా తనమెడని వేళ్ళాడుతుందే-వాడి చదువు ఖర్చోటి భరించాలే. అని బెంగపడ్డాడు. కాని యేం చేస్తాడు ? యీ గోలలన్నీ ఆలోచించకుండా ఆ తమ్ముడేమని చచ్చాడు ? అని మళ్లీ కోప్పడుకున్నాడు తమ్ముడిమీద.

గోపాలరావు రెండురోజుల్లో వొచ్చాడు. అతడు చామనచాయ పొడుగు సన్నం, కొంచెం నత్తి అనుమానం. పందొమ్మిదేళ్లుంటాయి – చిన్నప్పటినించి యింకోళ్లింటో పెరగడంవల్ల మర్యాదా. మన్ననా తెలుసు కాని లోకువా, దాస్యమూ అలవాటైనట్లు కనపడతాయి. నడిచినా, మాట్లాడినా, నిరంతర యాచకత్వం కనపరుస్తోవుంటాడు. అత

నాయేడే స్కూలుఫయినల్ పరీక్షకు వెళ్లాడు. అతని తల్లికది చాలాగొప్ప పరీక్షలాగుంది.

“వీడు బి. య్యేట. వాడు బి. యల్టట. కాని మావాడు స్కూ...లు...ఫై...న...ల్” అన్నట్లు మాట్లాడేది.

గోపాలరావుకి పెళ్ళి వుద్దేశ్యం లేదు. కాని పైకి తనని చదివించమని వెంకట్రావుగారిని అడగటం బావుండదని అతనికి తెలుసు. కనుక వెంకన్న పంతులు చదువు సహాయం చేస్తాననేటప్పటికి పెళ్ళికి వొప్పుకున్నాడు.

తల్లికి యీ సంబంధం అంటే యిష్టపడలేక. గోపాలరావు యేదో గొప్ప హోదాగల వుద్యోగం చేస్తోవుంటే పెద్ద కట్నం తీసుకుని, గొప్పింటితో వైభవంగా వియ్యమందాలని కలలు కంటోంది. తన పెనిమిటి చెల్లెలు యింటోంచి లేచి పోయి, రెండోపెళ్లి చేసుకున్న తరవాత, మళ్ళీ రెండోభర్త బాధలు పడలేక, పారిపోయి వొచ్చి అన్న కాళ్ళమీద పడ్డది. తన భర్త, చెల్లెలిమీద పూర్వపు కోపం మరచి పోలేక యింటోంచి గెంటితే, జాలిపడి, యీమె భర్త నెదిరించి, వొప్పించి-ఆమెని తనహృదయాని కద్దుకుంది. తిరవాత ఆ చెల్లెలెక్కడికో వెళ్ళిపోయింది, కాని ఆమె తెచ్చిన నెలిమాత్రం యీమెని వొదల్లేదు. భర్త పోయినాడు. ఆస్తి వ్యాజ్యాల పాలయింది. బంధువులొకరూ సహాయం చెయ్యలేదు. అక్రమంగా యెనురు ‘డి: కీలైన రోజుల’ కడుపుమండి, ఆ కోర్టుమునసబు వెంకట్రావుగారింటికి

వెళ్ళి, ఆయన్ని ఎదురుగా నోటికొచ్చినట్లు తిట్టింది. తనని బైటికి నెట్టిస్తాడనుకుంది. కాని ఆయన నవ్వి,

"తరవాత మళ్ళీ తిట్టుదువుగాని, ముందు సంగతేమిటో చెప్పు" అన్నాడు.

దాంతో శోకమంతా తిరగబెట్టి కొడుకుని ఆయన కాళ్ళమీద పడేసి తన కథ చెప్పుకుని ఆయన తీర్పు అన్యాయమంది ఆయనకీ అట్లానే తోచింది. కాని సాక్ష్యం రెండో వారివేపున వున్నప్పుడు ఆయనేంచేస్తాడు! సరే తల్లినీ కొడుకునీ తన యింటోనే వుండమన్నాడు.

పెళ్ళి గుళ్ళో ఒకరోజులో జరిగిపోయింది — వెంకట్రావుగారు వెళ్ళిపోయినారు. గోపాలరావు వెంకన్న పంతులు గారియింటో స్థిరపడ్డాడు. అతను పరీక్షలకి వెళ్ళాడు.

వచ్చిన మరునాటినుంచి రవణ వెంకన్న పంతులు గృహజీవిత బాధ్యత తనదిగా తీసుకుంది. ఆఫీసు కాయితాలు మొదలు పొడుంకాయవరకూ రవణ స్వాధీనమే. ఇదివరకు వెంకన్నపంతుల్ని చూడ్డానికి వొచ్చిన పెద్దమనుషులు సరాసరి హాలులోనికి రావలసిందే. ఆడవాళ్ళకి తిరగడం కష్టంగా వుండేది. ఉత్తరవేపు గదిలో సామాను వేశారు. తక్కిన స్థలంలో పిల్లలు చదువుకునేవాళ్ళు. రవణ తనే ఆ సామానంతా దొడ్డోపాకలోని గడమంచిమీదికి మార్చి. ఆ పిల్లలకి చదువుకోడానికి హాలులో స్థలమేర్పరచి గది ఖాళీ చేసింది. దాంటో వెంకన్న పంతులు చమట నలుపు పడకుర్చీ, యినపకడ్డీల కుర్చీలు నాలుగూ, సొరుగులు పోయిన పాత

బల్లా, అలమారూ అన్నీ సర్దింది. ఆరోజు వెంకన్న పంతులు కచేరినించి వొచ్చి హాలులో తలపాగ తగిలించపోతూంటే.

"యిట్లా యిట్లా బాగాయి" అని,

ఉత్తరపువీధి గదిలోకి తీసికెళ్ళింది. అంతా చూశాడు వెంకన్న పంతులు వొంకెకి ఆయన ఆఫీసు బట్టలు తగిలించి, చెప్పులు మూలపెట్టి జవాను చేత ఆఫీసుపెట్టె వ్రాగులాడేబల్ల మీద పెట్టించింది. కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళు వరండాలో సిద్ధంగా వున్నాయి; యెన్నడూ లేనిది మొహం సబ్బుతో కడిగించి తెల్లని తువ్వాలతో కాళ్ళూ మొహం తుడిపించి కొత్తగా తోమిన వెండిగిన్నెలో 'టీ' యిచ్చింది. తన పడక కుర్చీలో. నిట్టూర్పువిడిచి, పడుకుని, చుట్టూచూశాడు పంతులు. గోడ్డుమీది కిటికీలకి తెల్లని పరదాలు కట్టివున్నాయి. తన లా కాలేజీ గ్రూప్ ఫోటో, తన నాన్నగారి మూసిన పటమూ, తన పెళ్ళి గ్రూప్, మూడు సంవత్సరాలక్రింద రాధాకృష్ణ క్యాలెండర్, అన్నీ తగిలించి వున్నాయి. తనిప్పుడు యింటివేపు తలుపు, లోపల గడియ పెట్టుకో వచ్చు. పోలీసు యిన్‌స్పెక్టరుతో మాట్లాడుతూవుంటే, చిన్న కొడుకు వచ్చి,

"నాన్నా అమ్మ వెన్న కొంచెమే పెట్టింది" అని,

యేడవక్కరలేదు—జవానుని గుక్క తిరక్కుండా గంభీరంగా చీవాట్లు పెడుతోవుండగా మధ్య రావమ్మ,

"రాత్రికేం వంట చేయించమంటారు?" అని,

అడిగే అవస్థ తప్పిపోయింది. తన టేబిల్ లైటు మొహాన్ని చూసి తనెన్నేళ్ళయింది? అదిగో పెద్దకుర్రాడు యెనిమిది నెలలవాడు చెంచా పెట్టి బద్దలుకొట్టిన డోము. యీనాటికి కనపడ్డది మళ్ళీ

మర్నాడురాత్రి పందిరి మంచంమీద పడుకుని, కలెక్టరు దగ్గిర్నించి వొచ్చిన 'మెమో'లో కోపభావ మేమాత్రం కనబడుతోందని ఆలోచించుకుంటోండగా, రావమ్మ ప్రక్కన కూచుని గుండ్రని బొజ్జమీద చెయ్యేసి అదే కథ చెప్పింది. వంటకి సామానులివ్వడం, చాకలిపద్దు వెయ్యడం, బజారునుంచి వొచ్చిన సామాన్లు సరిచూడడం, దీపాలు చక్కగా తుడిపించడం, పిల్లలకు అన్నాలు, అన్నీ రవణే. యేదన్నా పని చెయ్యాలని వెడితే, యెవరో ఆపని అంతకు ముందే చేసివుంచుతారు. తనకి యింక పనులేంలేక గిలగిల కొట్టుకొని, ఆడవాళ్ళకి మీటింగులు పెడదామా, చంకీ పటాలుకుట్టడం ప్రారంభిద్దామా, యేదన్నా యాత్రకి బయలు దేరుదామా, అని ఆలోచిస్తూంది మళ్ళీ.

"కాని యెన్నాళ్ళుంటుంది? రెండేళ్ళలో వెళ్ళిపోతుంది. మళ్ళీ మన అవస్థ మనకి వుండనే వుంటుంది" అంది.

మళ్ళీ వంటావిడ చద్దెన్నాల విషయమై పోట్లాడడం, పిల్లల మారామూ, యింట్లో దుమ్మూ, అన్నీ కళ్ళకి కనపడ్డాయి. మళ్ళీ తనగదిలో విరిగిపోయిన సామాన్లు చిరిగిపోయిన పరుపులూ, విడిదూదీ కనపడ్డాయి వెంకన్నపంతులుకి.

ఇద్దరూ నిష్కారణంగా నిట్టూర్పులువిడిచి, ఒకరికేసి వొకరు దొంగ్లి, అనుకుని పడుకున్నారు రవణని తలుచుకుంటో.

గోపాలరావు యింటో స్థిరపడ్డ కొద్దిరోజులకే వంటామె పోట్లాడి వెళ్ళిపోయింది. రామమ్మకి ఆరోజునే తలనొప్పి వొచ్చింది. అప్పమ్మ మడికట్టుకుంది వంటావిడ వాళ్ళిరానూ లేదు; రామమ్మగారికి సంపూర్ణారోగ్యం కలగనూలేదు ఆమె చేసే కూరల రుచులు పొగడ్తమూ. గొరిగించుకో డానికి నెలకొక అణా, ఆమెకి వెంకన్నపంతులిచ్చే జీతం. గోపాలరావు పరీక్షలై వచ్చినతరువాత వారంరోజుల్లో, చాకలి వారంరోజులు పెళ్ళికి శలవు తీసుకుని వెళ్ళాడు. ఇంటినిండా మనుషులేగాసి మార్కెట్టుకి కూరలకి వెళ్ళేవాళ్ళే లేరను కుంటో గోపాలరావుముందునించి యిటూ అటూ నాలుగైదు సార్లు తిరిగింది రామమ్మ గోపాలరావే మాటాడుకు వెళ్లాడు. చాకలాడు పెళ్లినించి వొచ్చాడు, కాని గోపాలరావే కూరలకి మామూలైనాడు. మొదట్లో గోపాలరావు దొరక గానే, సమర్థుడు పిల్లనించి తమని తప్పించిన దైవంలాగు తోచినసంగతీ, రెండువేలు కట్నమన్నా సరేయిచ్చి రవణని పంపించెయ్యాలనుకుంటో వుంటే, ఒకదమ్మిడీ ఖర్చులేకుండా పెళ్లిచేసుకున్న సంగతీ, అన్నీ మరచిపోయినారు. తమ తిండి పూటకే పనిపాటా లేకుండా తినే సోమర్లాగు కనపడ్డారు. తల్లీ కొడుకూ. తన జీతంకోసం స్త్రీడక్లని పావలా అర్ధ అడిగి బతికే అలవాటు అతని స్వభావాన్ని గట్టిగాపట్టింది. యెంత ప్రయ త్నించినా అల్లుడిదర్జా అతనికిరాలేదు. యేదో ధర్మార్థం

పోషించే పిల్లమొగుణ్ణి వాళ్లు అల్లుడుగా చూసుకోరు. అందులో కల్పం లేకుండా చవకగా దొరికినవాడు చవకైనాడు. వూరికే వచ్చిన కాయకూరలమల్లే, గోపాలరావుని చూసినవాళ్లకసలు అతన్ని మర్యాద చెయ్యాలని బుద్ధి పుట్టదు. అతన్ని

"యేమిరా" అనా లనిపిస్తుంది.

"యేమండి" అంటే,

కోపమొస్తుందేమో అతనికి అనుకుంటారు. ఎవరేం పని చెప్తారా చెయ్యడానికి సిద్ధంగా వున్నానన్నట్టుంటుంది అతనిచూపు. పదిహేను రోజుల్లో అప్పమ్మ వంటా, రవణ పైపనీ, గోపాలరావు వూళ్ళోపనికింద స్థిరమయింది.

వెంకన్నపంతులికి యిద్దరు కొడుకులు. నారాయణా, నరుసూ.ఇద్దరూ సాధారణంగా పిల్లలు చేసే అల్లరికేమాత్రమూ తక్కువ చెయ్యరు. ముందు సందేహాలడగడంతో మొదలుపెట్టి, చివరికి రోజూ పాఠాలన్నీ గోపాలరావే చెప్పేట్టుగా నిశ్చయమైంది, పెద్దల్నిచూసి వాళ్లు అతన్ని అల్లరిచెయ్యడం మొదలుపెట్టారు. వాళ్లు పరీక్ష ప్యాసుకావడం అతని బాధ్యతగా పెద్దవాళ్ళు మాట్లాడారు. మొదటవాళ్ళు అతని కాళ్ళమీద వుయ్యాలలూగడం, బుజంమీద కూచోడం, తరువాత జుట్టుపీకటం, ముక్కులాగటం, అతను విసుక్కుంటే,

"గాడిదా, వెధవా" అనడం.

"అమ్మతో చెప్తా" ననడం.

తన్నడం దగ్గరికి వొచ్చింది.

"ఎందుకు ఆయనన్నట్లా అల్లరి చేస్తావు ?"

"నీకేం ?"

"తప్పవునా ?"

రవణనిచూస్తే యీ పిల్లలకి అమితమైన ప్రేమ !

"కాదు."

"కాదూ ? యింకోళ్ళని తన్నడం తప్పుకాదూ ? నిన్నేం చేశారాయన ?"

"లెక్కలు చేసిపెట్టమంటే చేసిపెట్టలా మరి ?"

"నీకు వొచ్చేదెప్పుడు ?"

"నాకు అవే వొస్తాయి. చెయ్యడం వొచ్చు."

"ఈసారి అయనేమన్నా చేస్తే నాన్నతో చెబుతా ?" చెప్పదనీ, సిగ్గనీ నారాయణకి తెలుసు.

"తన మొగుణ్ణి యేమిటో చేస్తున్నామని అక్కకి ఉక్రోషం. మొన్న పెళ్లయిందోలేదో ? పాఠం చదవలేదని నరుసుని గిల్లడం బాగానేవుంది. వీడెవడో తమ్ముణ్ణి గిల్లడానికి !" అని అరవడం మొదలుపెట్టాడు.

గోపాలరావుకు రవణ తన భార్య అనే దృష్టి బాగా కుదిరినట్టేలేదు. యింటో అతనికన్నా ఆమెకే యెక్కువ గౌరవం. అతనూ ఆమెని గౌరవంగా చూస్తాడు. రవణకి సిగ్గుపడి దాక్కోటం మామూలుకాదు కాని మాట్లాడదు.

మాట్లాడే అవసరంలేదు. గోపాలరావు యిట్లా నీచంగా బాధలుపడడం ఆమెకి కష్టంగావుంది. పెళ్ళికాగానే ఆ గోపాలరావూ, తనూ వొకటనీ, అతను తనవాడనీ ఆమె మనసులో ఏర్పడ్డది—అతనికి న్యూనత కలిగితే తనకి కలిగినట్టుంది. ఆ గోపాలరావుకి తనకి అవమానాలు జరుగుతున్నట్లు తెలిసినట్టే లేదు. తెలిసికూడా తప్పనిసరి అని వూరుకున్నాడా?

గోపాలరావు స్కూలుఫైనలు ప్యాసైనాడని తెలిసింది. అతనూ—అతని తల్లీ, అతను యింటరుమీడియేట్ చదవాలన్నారు. వెంకన్నపంతులు ఓవర్సీర్ పరీక్ష మంచిదన్నాడు. అసలు గోపాలరావు మార్కులు తెచ్చుకోడానికి, వరంపొంది పుట్టిన అవతార పురుషుడు. కాని ఆ పనిలో 'ఆసక్తి లేదనీ. ఆ సబ్జక్టుల్లో ప్రవేశం లేదనీ' చెప్పినా వెంకన్నపంతులు వినిపించుకోలేదు.

నాలుగేళ్ళు బి. యే. తరవాత రెండేళ్లు బి. యల్. యివన్నీ లెఖ్ఖవేసి చూస్తున్నాడు. ఈ గోపాలరావు జీవనక్షేమైతే అతనికేం! గోపాలరావు పట్నం వెళ్ళేటప్పుడు అతనికి రెండు పంచలూ, ఒక కోటూ, రెండు షర్టులూ కొన్నారు. జీతం ముందే కట్టేసి, అతనికి నెలకి యిరవై రూపాయలకంటె ఒక్కదమ్మిడీ యెక్కువ యియ్యనని కఠినంగా చెప్పాడు వెంకన్న పంతులు. చిన్నట్రంకు సద్దుకొని, కూలివాడి నెత్తిమీద పెట్టి, తన తల్లితో అతను వెడుతున్నానని చెప్పడానికి వొస్తే రవణకి కళ్ళంబడి నీళ్ళు తిరిగాయి. ఏదో తనకి తెలీని గొప్ప స్నేహబంధాన్ని విడిచి వొంటరిగా వెడుతున్నట్టు

గోపాలరావుకి తోచింది కాని ఆ అనుభవాన్ని కలుగచేసింది ఆ పన్నెండేళ్ళ చిన్న హృదయమని అతనికి తెలీదు.

గోపాలరావు వెళ్ళిపోగానే యిల్లంతా శూన్యమైనట్టుంది రవణకి. తను అతనితో వొక్కమాట మాటాడకపోయినా, అతనిసంగతి తనకేమీ తెలియకపోయినా ఆ వొక్క రోజూ అతనిపక్కన పీటలమీద కూర్చోడమూ, అతని చిటికెనవేలు పట్టుకోడమూ, తనని అతనిదానిగా చేసిన అభిప్రాయాన్ని తెచ్చాయి.

ఎండాకాలపు శెలవలకి గోపాలరావు వచ్చేలోపున రవణ పెద్దమనిషయ్యింది. వెంకన్నపంతులికి రవణ కన్నకూతురుకన్న ఆప్తురాలయింది. ఆఫీసునించి వొచ్చింది మొదలు మళ్ళీ పడుకోపోయేవరకూ రవణ వొక్క నిమిషం యెడంగా వుండటానికి వీల్లేదు. అయన్ని క్లబ్బులో చేర్పించి, షర్టువేసి, కండువావేసి, చేతికర్ర అందించి సాయంత్రం క్లబ్బుకి పంపించేది. భోజనం చేసేటప్పుడు రవణ యెదురుగా కూచోవాలి. భోజనం కాగానే ఆంధ్రపత్రికా, సాహితీ, కథాసరిత్సాగరమూ, ఆయనకి రవణ చదివి వినిపించాలి. పొద్దున్నే రవణా అనేపిలుపుతో లేస్తాడు. రామమ్మకీ అప్పమ్మకీ రవణప్రాణం.

అప్పమ్మ రోజుకోసారి రవణని కావలించుకొని,

"మా గోపాలం అదృష్టం" అంటో వుంటుంది.

రామమ్మ "యిట్లాంటి పిల్లని ఆ వెధవ చేతులో పెట్టాము, సుఖపడిపోతాడు దరిద్రుడు" అనేది,

చెన్నపట్నంనించి రైలుదేరేముందు, గోపాలరావు తను వెళ్ళబోయ్యే యిల్లుసంగతి తలుచుకొని భయపడ్డాడు; కాని ఆలోచించగా మళ్ళీ, తను యీసారి గౌరవంగా వుండకూడదా అని తోచింది. తనంతట తనే లోకువపుచ్చుకున్నానని తనుమాత్రం బెట్టుగావుంటే, వాళ్లుకూడా గౌరవం చూపుతారనీ తోచింది. యీడాది చెన్నపట్నంలోవుండి, యితరులతో సమపద్ధతిని మెలగి, కొన్ని విషయాలు నేర్చుకున్నాడు. కాని గొప్పవాడివలె తనతో ఒక్కమాట మాటాడక, తన వంకనైనా చూడక, పైగా తనభార్య రమణతో నవ్వుకుంటూ పనులు చేయించుకునే వెంకన్నపంతులూ, చాకలికన్నా తనని హీనంగాచూసి, మాటలనే రానమ్మా, తన ప్రాణాలు కొరుక్కుతినే హిరణ్యకశిప హిరణ్యాక్షుల్ని తలుచుకునేటప్పటికి మళ్ళీ భయంతో ప్రాణం తత్తరిల్లింది. కాని మళ్లీ వాళ్లందరూ ఒక సంవత్సరం దూరం కావడంచేత కొంచెం మంచివాళ్ళలాగే తోచారు. రమణని తల్చుకుంటే యేదో కడుపులో సంతోషం పొంగినట్లయింది. ఇంకొకళ్ళ యింట్లో తన చదువుకోసం చాకిరిచేస్తున్న తల్లిని జాలివల్ల చూడాలనిపించింది. ఏకో స్కూల్ఫైనలన్నా ప్యాసుకాని కుర్రాడని తనని ఆశించారు, గాని కాబోయ్యే వోవర్సీరును దేపిస్తారా? మొన్న ప్రిన్సిపాలు తనని కుర్చీ యిచ్చి మర్యాదచేశాడే? ఆ సంగతి యెట్లాగో వాళ్ళకి తెలిసివుండదా" అన్నట్లుగా భావించుకున్నాడు. ఈసారి తన హోదా తను నిలుపుకోవాలి... రైలుదిగి జట్కాబండిమీద దర్జాగా యింటికివొచ్చి సామాన్లు హాలులో పెట్టించి బండివాడిచేతిలో నాలుగు

అణాలు పెట్టాడు. వాడు చాలదని గోలచేశాడు. గోపాలరావు కేకలేశాడు. వాడూ కేకలేశాడు. యిదేమి తనకొత్తహోదాకి తగినట్టుగాలేదని, సరే వాడడిగిన రెండణాలూ పారేద్దామని సంచిలో చెయ్యిపెడితే అణాన్నరేవుంది, ఇంటోనుండి ఒక్కరూ రాలేదు. కనపళ్ళేదు. ఆ అణాన్నరయిచ్చి గొంతు తగ్గించి,

"చిల్లరలేదు యెప్పుడేనా అప్పుతీర్చుకొంటా" నని.

వాణ్ణి బతిమాలి, గుర్రపుబండిదర్జాకి తనని తాను తిట్టుకొని హాలులోకి వస్తూవుంటే, యింటో రామమ్మ.

"ఏం. ముందేమాట్లాడుకోకూడదూ. బండిబాడుగ! ... వెధవదర్జా"

అనటం వినబడ్డది. ఇంకేందర్జా తనకి! హాలులోకి వెళ్ళి పెట్టెమీద కూలబడ్డాడు. ఒక్కళ్ళూ రాలేదు. పలకరించలేదు. రవణవ్వాళ్ళోలేదా? తన అమ్మకూడలేదా? పోనీ యింటోవాళ్ళు వచ్చి, ఆ సంగతిచెప్పి పొమ్మనకూడదూ? కాలు కదల్చడానికి అభిమానం. యెప్పటిదాకా యిట్లా! తనురైల్లో అనుకున్న సంగతులు జ్ఞాపకమొచ్చాయి. తను రైలు దిగగానే వెంకన్నపంతులు కుర్చీచూపించి కూచోమని కబుర్లుచెప్పడం, రామమ్మ కాళ్ళు కడుక్కోడానికి నీళ్లు తెమ్మని కేకెయ్యడం, రవణ యెక్కడో వెనుక నుంచొని నవ్వుతున్న ముఖంతో కనపడ్డం, తనతల్లి,

"నాయన వొచ్చావా, అనడం,

యిప్పుడిట్లా అయిందే? అని దిగాలుపడిపోయినాడు. ఇంక రెండునెలలెట్లా గడపటం యీ యింటో!... పావుగంటకి

అప్పమ్మ వచ్చి సంతోషంతో అన్నీ అడిగి కాళ్ళు కడుక్కో-మంది.

గోపాలరావు రైలు ఆలస్యమయింది. అందాకని ఆవేళకే వెంకన్న పంతులు కచేరికి వెళ్ళాడు. పిల్లలు బడికి పోయినారు. అప్పమ్మ అన్నంతింటోంది, గోపాల్రావు రాలేదనుకొని, బండిచప్పుడు కాగానే, రవణ కిటికీ దగ్గిరికి వొచ్చిచూసింది గోపాలరావు మారినట్లు కనిపెట్టింది. పొట్టిగా కత్తిరించిన తివాసీక్రాప్ పెట్టాడు మీసాలు పెరిగాయి. ఆ షర్టు కాలరు చెన్నపట్నం రకం, మాటకూడా మారింది. కొంచెం నాగరికం వొచ్చింది అనుకుంది. గోపాల్రావు ప్రతి శెలవలకీ వొస్తాడనుకుంటో వుండేది. ఇరుగు పొరుగు పిల్లలు పట్నంనించి వొస్తే పైకి అప్పమ్మా, లోపల రవణా గోపాల్రావు రాలేదే తమకే డబ్బుంటే, రైలుచార్జి పంపించే వారంకదా, అనుకునేవారు. రవణదగ్గిర వాళ్ళ నాన్న నెలకు పావలాయిస్తే పూర్వం కూడబెట్టుకున్న సొమ్ము నాలుగురూపాయలుంది. చెన్నపట్నం రాను పోను అది సరిపోతుందేమో పంపాలని వుండేది కాని యెట్లా తెలుసుకుంటుంది? అడిగితే గోపాలరావుకోసమని తెలుసుకుంటారని భయం. అప్పమ్మతో మాటాడటం కూడ సిగ్గే గోపాల్రావు మీద రవణకి పెద్దప్రేమ అప్పుడే వుందనికాదు. తన వాడ తననీ, తను అతనికి సంతోషం గలిగిస్తాననే అభిప్రాయం యేదో వుంటుంది. బొమ్మలమీద చూపే ప్రేమకొంత అతనిమీదకి వెళ్ళింది. అతను బండి దిగడమూ, తను

యెదురుగా నుంచోడమూ, అతని మొహంలో కనపడే సంతోషాన్ని తను చూడ్డమూ తలుచుకునేది. కాని ఆమె పెద్దమ్మనిషయిం తరువాత, యింటోవాళ్ళనే మాటలూ, గోపాల్రావు వోస్తాడనగా వాళ్ళు చేసిన వేళాకోళాలు పెద్ద సిగ్గు తెచ్చిపెట్టాయి ఆమెకి. అందుకనే కిటికీలోంచి ఒకసారి చూసి పారిపోయి మళ్ళీ కంటపళ్ళేదు.

రాత్రి భోజనం దగ్గిర వెంకన్న పంతులు గోపాల్రావుని పలకరించి, చదువు సంగతీ, ఖర్చు సంగతీ మాట్లాడాడు.

"అయినా మీరు చదివే దేమిట్లే, యీ కాలవ వొడ్డునా, ఆ కాలవ వొడ్డునా, తాత్సారం చెయ్యడమేగా; మునపటివాళ్లు వోవర్సీర్లయినారంటే, యే బిల్డింగన్నా కడితే యింక వెయ్యేళ్ళయినా చెక్కు చెదరక పడివుండవలసిందే. ఇప్పటివాళ్ళు బొమ్మరిల్లు కట్టాలంటే యిగనైతొమ్మిది ప్లానూ ముప్ఫై యెస్టిమేట్లూ వేసి, చివరికి ఆరు నెలల్లో కింద కూలేట్టు తయారు చేస్తారు."

అంత సర్వజ్ఞంగా మాట్లాడుతో వుంటే గోపాల్రావు యేమంటాడు? రాత్రింబగళ్లు మేలుకుని తను చదివిన సంగతి, వోవర్సీరు పరీక్షకు వెళ్ళమని తనని ప్రోత్సహిస్తూ యేడాది కిందట వెంకన్న పంతులు ఆ డిపార్టుమెంటుని పొగుడ్తో చెప్పిన మాటలూ జ్ఞాపకం వొచ్చి వూరుకున్నాడు.

"మీ 'లాడ్జి'లో యెంతమంది వున్నారు?"

"యిరవై ముగ్గురం."

"అందరూ బ్రాహ్మలేనా!"

"ఆరుగురు కాదు."

"క్రిష్టియన్లున్నారా!"

"ఒకడు."

"వాణ్ణెందుకు రానిచ్చారు!"

"నాయిష్టమా! అయినా యెవరయితేనేం!"

"యివీ వీళ్లు పట్నంపోయి నేర్చుకునే సంగతులు. చదువేమాత్రం వెలిగిస్తారో కాని, యీ కులాచారాన్ని వెక్కిరించడంలో మాత్రం గట్టిగా తయారౌతారు."

పట్నం పొమ్మని పట్టుపట్టింది వెంకన్న పంతులేగా! ఆయనకే మాత్రం కులాచారాలున్నాయి! యివి అనాలని పించింది గోపాలరావుకి. కాని లోకువతనం బాగా అలవాటు కావడంచేత ఆ మాటలు పైకిరాలేదు. గోపాలరావు మాట్లా డకపోవడంచూసి, వెంకన్న పంతులు—

"నీయిష్టం కాకపోతే, ఆ లాడ్జిలో యెందుకున్నావు!" అన్నాడు.

మీరు పంపే యిరవై రూపాయలతో యింకెక్క డుండేదీ! అనాలని పించింది. కాని వూరుకున్నాడు.

"పోనీ సుశర్ల వెంకటేశ్వరరావు పంతులుగార్ని చూశావా!"

"యెందుకు!"

"యెందుకట! అట్లాంటి ప్రయోజకుల్నీ, ధర్మాత్ముల్నీ చూస్తే యేంలాభం? యీ క్రిష్టియనువాణ్ని. యీ తెల్ల మొహాన్నీ, పట్టుకుని వేళ్ళాడడంతో సరిపోతుంది. వెంకటేశ్వ రావు పంతులంటివాళ్ళుండబట్టే, మన సాంప్రదాయాలూ, ఆచారాలూ నిలబడివున్నాయి దేశంలో,"

తను దొరలచుట్టూ తిరగడం, కలెక్టరాఫీసు సిరస్తాదారు క్రిష్టియనువాడికి ముందు నమస్కారం పెట్టవలసిరావడం, తన హృదయంలో కలిగించే బాధని, యిట్లా యితర్లని అంటూవుండడంలో తీర్చుకొని. కొంతవరకు బాధ్యత చెల్లించి, పురాతనధర్మం నిలపెట్టానని సంతుష్టి పొందుతో వుంటాడు పంతులు. ఆ వెంకటేశ్వర్రావు గొప్పవకీలు. కాని వేషమూ భాషా అంతా వీలైనంత పూర్వాచారంగా వుంచుతాడు.

పూర్వాచారం సంగతి తలుచుకునప్పుడు ఆయన్ని ప్రజలు—పొగుడుతూ, ఆయన, కోర్టులో జడ్జీలు, మొదలైన వారు చేసే మానసిక దురాచారాలు జ్ఞాపకం చేసుకోరు. యింటి దగ్గిర కనపడే పిలకా, విభూదీ. గావంచాపంచ లేగాని! పురాతనమతం తలుచుకున్నప్పుడు వకీలు వెంకటేశ్వర్రావు యీనూతన నాగరికతకు, ధనాశకు, లోబడక తమ శిష్టాచారమే ప్రధానంగా యెంచి పల్లెటూళ్లు విడవక వేళ్ళాడే, సనాతన స్వభావులైన శిష్టాచారపరులు జ్ఞాపకంరారు.

వారంరోజుల్లో గోపాలరావు స్థితి మళ్ళీ మొదటి కొచ్చింది. పిల్లలు అల్లరి ప్రారంభించారు. ఒకరోజు రామమ్మ

మేనమామ వొస్తే అతని మంచం లాక్కొని ఆయన కేశారు. మళ్ళీ బజారుకి స్పష్టంగాచెప్పి పంపుతున్నారు. పైగా

"యేమిటీ వంకాయలు తేవడం, అన్నీ పుచ్చు" అంటారు కూరచాలకపోతే,

"తెచ్చేవాళ్ళంత తెలివిగా తెస్తున్నారు" అనేదీ, బెండకాయలు వొడిలిపోయినాయంటే

"మొక్కవ్రా! బజారు వెళ్ళటం తప్పుతుందికదా అవి ఒకేసారి కొని తెచ్చి పడేస్తే!" అనడం ప్రారంభించారు.

ఒకసారి గోపాలరావు దారిలో వున్న పాలచెంబు తంతే

"కళ్ళు కనపట్టం లేవూ!" అన్నారు.

రవణ కివన్నీ చాలాకష్టంగా వున్నాయి. తనకోసం పాపం అతడీ బాధలన్నీ పడుతున్నాడని విచారం వెంకన్న పంతుల్తో అప్పమ్మతో మాట్లాడాలంటే సిగ్గు అప్పమ్మ చాలా మేధకురాలు నోరెత్తడం చాతకాదు. ఎక్కడా కోపమూ, చిరాకూ, రోషమూ, యేమీలేకుండా, ఆమె తండ్రీ, మొగుడూ జీవనమూ చావకొట్టేశారు పతివ్రత క్రింద చాలా పేరు తెచ్చుకుందే కాని, వితంతువై లోకంలో మెలగవలసి వొచ్చినప్పుడు మొగుడూ పనికిరానిదయింది. మొదట చిన్నప్పుడు తనమాట వినకుండా పెంకెతనంచేస్తే తనగంతం వినేప్పటికి వొణికేట్టుగా తండ్రి చావకొట్టి తనకుక్కని చేసుకున్నాడు. ఈతండ్రి సరైన కట్నం యివ్వ లేదని అతని పేరెత్తితే తన్నేవాడు ఆ భర్త. ఆ భర్తపోయిన

తరువాత ఆ భర్త పేరూ అతని పునర్వివాహపు చెల్లెలు పేరూ యెత్తితే నోరు నొక్కిందీ సంఘం. చివరికి యేమీ చాతగాక, కొడుకుని కాపాడుకోలేని అప్పమ్మా, నోరెత్తడానికి భయ పడేట్టు ఆమె పెంచి తయారు చేసిన గోపాల్రావు మిగిలారు. ఆమె నట్లా పిరికిదాన్నిగా తయారుచేసి, గోపాలరావు చిన్న ప్పుడు పిరికితనం చూపితే

"పిరికి వెధవని కన్నావు" అని

వెక్కిరించేవాడు ఆ భర్త.

స్వేచ్ఛగా రామ్మూర్తి దగ్గిర పెరిగిన ఒక్క రవణకి మాత్రం యీ గోపాల్రావు అవస్థ దుర్భరమయింది. యెట్లాగో అతనికి సహాయం చెయ్యాలని పించేది. నారాయణనీ, వరుసునీ చివాట్లేసింది. వాళ్ళతో మాట్లాడ్డం మానేసింది. కాని వాళ్ళు ఆమెనికూడా అల్లరిచేశారు. ఒకరోజు సాయింత్రం నారాయణ గోపాల్రావుని బజారుపోయి తనకి తెల్లకాయితాలు తీసుకు రమ్మన్నాడు. షికారు వెళ్ళి వొచ్చేటప్పుడు తెస్తానన్నాడు. కాని మరిచిపోయినాడు.

"మరిచిపోయినావూ? రేపెట్లా నాకు? మా మాష్టరు కొడితే నువ్వడ్డమొస్తావా? కావలసి నన్ను కొట్టి చాలనే తీసుకురాలేదు మరచిపోయినానంటావా దొంగగాడిద!"

రవణ చీకట్లో నుంచుని, చూస్తోంది. గోపాలరావు మొహం కూడా జంకినట్లు కనపడ్డది. ఆమె యింక సహించ లేకపోయింది. అందరూ భోజనాలు చేసేప్పుడా రాత్రి,

"నారాయణ యామన్నా అంటే రెండు చంపలూ వాయించండి. వూరుకోడం నీచం. వూరుకుంటే యింకా అంటాడు. యామైతే అదే అవుతుంది. వూరుకోకండి" అని

రాసి అతని ఆఫీసు జేబులో పెట్టింది. అది చూచు కున్నాడో లేదో గాని, గోపాలరావు పిల్లల్ని యేమీ చెయ్యలేదు.

గోపాలరావు మళ్ళీ పట్నం వెళ్ళకముందు అప్పమ్మ గారు కార్యం సంగతి యెత్తింది ఎందుకెత్తిందో ఆమెకే తెలీదు. ఏదో సాధారణంగా పిల్ల పెద్దవగానే అట్లా అడగడం లల్లివిధి అనుకుని వుంటుంది. కాని వెంకన్న పంతులిది వరకే సమాధానం యోచించి పెట్టుకున్నాడు. యిప్పుడు కార్యం చేస్తే వీళ్ళిద్దర్నీ పట్నంలో కాపరం పెట్టాలేమో! కాపరం పెట్టక పోయినా, యిప్పుడు రెండుమూడు వందలు తగలేసి యెందుకు తను కార్యం చెయ్యాలి? అరవణని అప్పుడే వీడికి స్నేహంచేసి యెందుకు వాణ్ణి సుఖపెట్టాలి. వెంకన్నపంతులు మనసుకి ఆ నిమిషానికి ఆ కార్యమంతా యేదో అసహ్యంగా కనపడ్డది. ఈ గోపాలుగాడే తన తల్లికి పురెక్కించి మాట్లా డించి వుంటాడు. వాడికి సిగ్గులేదు. అంత తొందరకి నమ్మకడీ లేని వెధవ, వాడి పెళ్లాన్ని పిల్లల్ని యెవడు పోషిం చును? వీడిమీద శ్రద్ధ యెక్కువై రవణ తనని సరిగ్గా చూస్తుందా? తనమీదవున్న గౌరవం ముందు వుంటుందా? రవణ తన కూతురైనట్టూ, యీ గోపాలరావు ఆమెకి యేమాత్రమూ తగని నీచుడైనట్టూ తోచింది, పంతులికి.

పైకిమాత్రం, యింత చిన్నతనంలో కార్యం కూడదని నిశ్చయించాడు. అదివరకు మూడు నెలలకిందే యెంత చిన్నతనంలో కార్యంచేస్తే నైతికంగా అంతమంచిదని క్లబ్బులో గంట వాయించాడీ పంతులే. అదిగాక కార్యమైతే యింటిసంగతే ఆలోచిస్తూ, సరిగా చదవడ చేశాడు? తీరిపోయింది.

ఈగోలంతా వొదిలి చెన్నపట్నం యెప్పుడు పోదామా అనిపించినా, వెళ్ళే చివరిరోజు వొచ్చేప్పటికి గోపాలరావుకి చాలా కష్టమనిపించింది. రవణని వొదిలి వెళ్ళడం. తనొక్క మాట రవణతో మాట్లాడక పోయినా, నిలకడగా రవణ వొంక చూడ్డానికి కూడా యీసారి అవకాశం దొరక్క పోయినా, ఏదో రవణ హృదయం తన్నావరించినట్లే వుండేది. ఆమె పమిటచెరుగు చివరో, కాలువుడమో, కంఠస్వరమో, అతన్ని ఝల్లుమనిపించేవి. తనకోసం ఒకదు సిగ్గుపడుతున్నారంటే, తనని ఘనంగా చూసుకుంటున్నారంటే యెంతో ఆహ్లాదం కలిగింది అతనికి. ఈప్రాణ్ని, యీకుటుంబంలో అతనింత నీచంగావున్నా, తన కాలేజీలో తనని అందరూ గౌరవిస్తారని తను చాలా తెలివిగా పనిచేస్తాననీ, రవణకి తెలియ చెయ్యాలని వుండేది. ఒకసారి రవణకి వినపడేట్టు వరుసతో తన సంగతీ, తన కాలేజీ సంగతీ చెప్పాడు. కాని యింతలో నారాయణ వొచ్చి నవ్వి, అన్నీ అబద్ధాలు పొమ్మన్నాడు.

చిన్నప్రటంకు సద్దుకుని ముందే కూలి మాట్లాడుకుని కూలివాడి నెత్తిమీద పెట్టి, తల్లితో వెడుతున్నానని చెప్ప

నానికి వొస్తే మళ్ళీ రవణ హృదయం చిన్నిపిట్టలాగు కొట్టుకుంది తను దాచుకున్న నాలుగు రూపాయలూ అత్త చేతుల్లో పెట్టి, మెల్లిగా.

'ఇయ్యండి' అంది.

వెనక దొడ్డిగుమ్మంలో నుంచుని రవణ చూస్తోంది. గోపాల్రావు చేతుల్లో తల్లి రూపాయలు పెట్టి

'యియ్యమంది' అంది.

అతనికి నోట మాటరాలేదు. ఆశ్చర్యం, దుఃఖం అన్నీవొచ్చాయి. సిగ్గు మరీ హెచ్చింది. తీసుకోవాలని లేదు. కాని యియ్యడమెట్లాగో తెలీక జేబులో వేసుకుని, తలపైకెత్తి రవణ వేపుచూసి వెళ్ళిపోయినాడు.

౪

డిసెంబరు శలవలకి రావమ్మ తమ్ముడు అక్కని చూడ్డానికి వొచ్చాడు. అతను కవి. అనేక పత్రికల్లో అచ్చుపడ్డ అతని పద్యాలను భావకీ అక్కకీ వినిపిస్తూ వుంటాడు. రసవంతమైన చోట్ల తలెత్తి రవణవంక చూస్తాడు, ఆమెకవేమీ అర్థం కాకపోయినా, కవిచేసే వ్యాఖ్యానాలవల్లా, అతని కంఠస్వరపు స్ఫురణలవల్లా అర్థమైనట్టూ, ఆనంద దాయకంగానూ తోచేవి. ఒకరోజు ఆదివారం మధ్యాహ్నం శాస్త్రులుగారివాళ్ళవొస్తే రావమ్మ వెళ్ళింది. అదివరకే కుర్చీలో వెంకన్న పంతులు నిద్రపోయినాడు. కవి రవణకి

చదువుతూ నేవున్నాడు. రవణకి నిద్రవస్తోంది. చెప్పడానికి సిగ్గు.

"నిద్రపోతున్నావా!"

రవణ కళ్ళు తెరవలేదు. ఆమె చెయ్యిపట్టుకు వూపాడు. ఆమెవొళ్లు ఝల్లుమన్నది.

"వింటున్నా చదవండి."

"ఏం వింటున్నావు? నిద్రమసకల అలజడేనా!"

ఇంకా అతని చెయ్యి ఆమెమీద నేవుంది. చెయ్యి దూరంగా లాక్కుని కూచుని

"చదవండి" అంది

మర్నాటినించి రవణకి అతన్ని చూడడమంటేనే సిగ్గుగా వుండేది. అవొక్క నిమిషపు స్పర్శతో కొత్తలోకపు ద్వారాలు తెరుచుకున్నాయి రవణకి. ఆమెకి తెలీకనే ఆమె శరీరం అట్లాంటి అనుభవంకోసం వెతుకుతోంది. ఆ అనుభవానికీ తనమోహపు జీవనానికీ సంబంధ మున్నదని ఆమెకు తెలీదు. కాని సుబ్బారావుకీ అతని ముఖాన్నీ, అతని మాటల్నీ, యెంతో సరదాగా చూస్తోంది. ఆమె మనసులో యేమాత్రమూ వికారమన్నది లేకుండా చిన్నపిల్లలు బొజాలని చూసినట్లు. కాని సుబ్బారావు ఆచూపుల్ని తనయెడలి అనురాగ చిహ్నాలుగా గ్రహించి, ఆమెవైపు గాఢమయిన అనురక్తిని కనపరచాడు. రవణ కవి అర్థంకాలేదు. వాటిలోని అపాయము ఆమెమనస్సుకి తెలీలేదు. సుబ్బారావుకి పెళ్ళి

అయింది. పురుషుల్లోనూ, ముఖ్యంగా స్త్రీలలో నూతన పద్యాలరసానికి సహృదయుల్ని వెతుకుతో వుంటాడు. తన కవిహృదయంతోనూ, తనభావాధిక్యంతోనూ రచన ఐక్యమై, తనను ప్రేమించి, తన అసంతృప్తిని పరిహారము చెయ్యానిశ్చయించుకొన్న దనుకున్నాడు. ఈ కవికుమారుడికి అంతరాత్మ తక్కువ. సంఘబంధనాలు అంటవు కాని యితని స్వేచ్ఛావిహారం వల్ల కలిగే బాధ్యతలను మాత్రము వహించడు. పరస్త్రీ హృదయాన్ని జయించి, శరీరాన్ని అనుభవించి, సంతానాన్ని కటాక్షించేవరకే యితని బాధ్యత.

ఆ స్త్రీపడేబాధలూ, ఆ సంతాన పురోవృద్ధీ, పరమేశ్వరుడి బాధ్యత కావలిస్తే ఆమెకి తను కల్పించిన అశ్రుధారలమీద రెండు గీతాలు వ్రాస్తాడు. అవి చదువుకుని ఉపశమన పడవొచ్చు, ఆ అనామక స్త్రీ వ్యక్తి. యితని అంతరాత్మ అంతతో సంతృప్తి పడుతుంది. యీనీతి నిబంధనలను యితని మనసులోను, గదులలో రహస్యంగానూ, స్నేహితులతో, వేళాకోళంగాను, మాట్లాడుతాడుగాని యెదిర్చి లోకం అడిగితే, యేకించితైన బాధగాని, తటస్థించేట్టుంటే,

'నిజమంటే యేమిటి?' అని

అడుగుతాడు. ఈ శెలవలు అయిపోతే తాను వెళ్ళిపోతాడు. ఒక్కరోజు ఆగడు. రచన కన్నీళ్ళుగాని, ప్రేమగాని, ఒక్కగంట అతన్ని ఆపవు. తననునమ్మి తనవెంట వస్తానంటే, చెప్పకుండా పారిపోతాడు. కాని ఆ పదిరోజులూ ఆమె ననుభవించడాని కతనికేమీ అభ్యంతరంలేదు. యింకా

యెక్కువ మాట్లాడారంటే, కృష్ణలీలక్రిందా, ఆధ్యాత్మిక ప్రేమక్రిందా మార్చి పద్యాలు రాశేస్తాడు.

సుబ్బారావు చూపులు రవణని చాలా కలవర పెట్టాయి.

ఒకరోజు బావిగట్టున రవణ నొక్కదాన్ని పట్టాడు.

"నిన్నరాత్రి వినడానికి రాలేదేం?"

"అత్త ముట్టయింది. పని చేస్తున్నాను."

'పనా? లేక నా పద్యాలు బావుండవా?"

"బావుంటాయి. పనివల్లే రాలేదు."

"బావుంటే, నీకోసం అవన్నీ రాసి, చదువుతో వుంటే..."

"నాకోసం!"

"నీకోసమే. నిన్ను చూడకపోతేనేం, యిన్నాళ్ళూ నాకు తెలీకుండా, నీరూపమే. నీసౌందర్యమే నన్ను ప్రోత్సాహించాయి."

"నాకు తెలీటం లేదు."

"మరి. నాకేం బహుమానం?"

"బహుమానం ! యేమిటి?"

"మరి కవిని సత్కరించవా?"

"నేనా?"

"నువ్వో"

"యెట్లా?"

"నీమాంపు; ప్రేమగల వొక్కమాట చాలనూ?"

"సరేలెండి నాకేం తెలీదు." అని

వొచ్చేసింది.

మర్నాడు అప్పమ్మగారు

"సుబ్బారావువంక అట్లా చూస్తావేమిటి? మంచి దానివే! యిట్లాంటి అమర్యాద పనులు చేశావంటే వాడికి రాయిస్తాను." అంది.

ఏం జవాబు చెప్పాలో రవణకేం తెలీదుగాని, ఆ మాటతో ఆమెమనసులో సందేహాలూ, ఆలోచనలూ. మొదలు పెట్టాయి. ఆనిర్మలాంతఃకరణంలోంచి 'యెన్నో విషయాలు' ఆమెకి తెలీనివి, తెలీవనుకున్నవి, పైకి కొంచెంగా తలలెత్తాయి. తనచూపుల్లో అర్థమున్నదనీ, బేధాలున్నాయనీ ఆమె గ్రహించింది. పెద్ద సిగ్గొకటి ఆమె నాకర్షించింది. సుబ్బారావువంక తేరిపార చూసేసిల్లి, యిప్పుడు కలవర పడడమూ, రెప్పల్ని సిగ్గుతో వాల్చడమూ. అతను చూడనప్పుడు కను చివరల్లోంచి అతన్ని చూడడమూ మొదలు పెట్టింది. సుబ్బారావు కివి యింకా శుభసూచకాలుగా కనపడి, నూత్న యవ్వనంమీద, వాలుచూపులమీద నాలుగైదు గీతాలు వ్రాసి పత్రికకి పంపాడు — స్నేహితులకి అతని అదృష్టం ప్రకటిత మయ్యేందుకు.

మార్నాడు సుబ్బారావు వెళ్ళిపోతున్నాడు. సాయం త్రం కాయితమూ, కలమూ, తీసుకుని కాలవవొడ్డున చింత చెట్టుకింద పద్యాలు రాయాలని కూచున్నాడు; గాని రవణ తలంపు మనసుని కలవరపెట్టి విరహావస్తని హెచ్చుచేసింది. కొత్తగా పిండే ఆమె వక్షమూ, కళ్లువిప్పవి యౌవనభావమూ అతన్ని చాలా ఆకర్షించాయి. యిప్పుడు తనువొదిలి వెళ్ళి పోయినాడా యింక మళ్ళీ ఆభర్త వొస్తాడు. ఇంక రవణ శరీ రాన్ని. హృదయాన్నికూడా అతనే స్వాధీనం చేసుకుంటాడు. ఏమీ యెరక్క మిణుగురు పురుగు కాంతివలె అప్పుడప్పుడు తోచి ఆకర్షించే ఆకళ్ళలోని కాంతి మాయమవుతుంది, తన చేతి కందినప్పుడు. కొత్త అనుభవంతో ఆమె మొఖంలో వచ్చే మార్పులూ, ఆమె శరీరం భయంతో వొణకడం, లజ్జతో ముడుచుకోడం, తలుచుకుని, ఆ స్వర్గానుభవంలో పరవశుడై, తన్మయుడై ఆ కవి యెంచుకొన్న ఆనందం లోనూ, తనది కాదనుకునే తియ్యని బాధలతోనూ, తన యవ్వనశోభలో తనే మైమరచి కూర్చున్నాడు.

రాత్రిపడ్డది. తెల్లారి వెళ్ళిపోవా లనుకున్నాడు. ఏం చెయ్యాలనుకున్నా యేమీ చేతకాదని తెలుసు గనక కవి త్వంలో పడ్డాడు. రవణ సైరంధ్రి, అక్క సుథేష్ణ, బాగానే వుంది. కాని యీ అక్కతో తన బాధసంగతి యెత్తితే, చెప్పు తీసుకుంటుంది. కొంచెం ప్రణయం విస్తరించే గీతం ఆమె ముందు చదవడమే భయంగా వుంటుంది. కాని పాండ వుల భయంలేదక్కడ; విషాదాంత కావ్యం కాదు. కాని

యీ అందాన్ని అనుభవించకుండానా ? యింటివేపు నడి చాడు. ఒకవేళ రవణ తనకోసమై యెదురు రాదుకద! వొస్తే యీ రోడ్డుమీది దీపాలొకటీ ! మర్నాడు వెళ్ళిపోతున్నా నని తెలీదా ! ఆమెకి ! యింక అప్పట్లో రానని చెప్పాడుగా తను ! తనబాధ ఆమెకి తెలీదా ? కాని యీ కవికి, పురుషుడు నేర్పితేనేగాని, కన్యాహృదయం వికసించదనీ, యీ భావాలూ, విరహాలూ, సమాజం కావనీ తెలీదు. రవణ కాలేదు. దొడ్లో పచ్చడి రుబ్బుతోంది. ఎక్కడ మాసినా, యీ అప్పమ్మ రవణని కాపాడుతోంది. ఈ ముసలి దెక్కడ పోగయిందో ! తన సంగతంతా కనిపెట్టి వెయ్యికళ్ళతో వెతుకుతున్నట్లుంది. ఈ ముసలివాళ్ళమీద ఒక పద్యం రాసెయ్యాలి... ...

రవణకి రాత్రి యేదోవేళ మెలుకువ వచ్చింది. ఏదో మెలుకువ తెప్పించినట్లయింది. దీపంకింద అత్త నిద్రపోతోంది. దీపం మెల్లిగా ఆరిపోతోంది. ఇంకా ఎవరో హాలులో వున్నట్లు తట్టింది. కనురెప్పల కిందనుంచి మెల్లిగా చూస్తోంది, దీపం ఆరి చీకటయింది. ఎవరో చీకట్లో కదులుతున్నారు. కళ్లు బాగా తెరిచి చూసింది. ఏమీ కనపట్టంలేదు. ఎవరో దగ్గరిగా మెల్లిగా అడుగడుగు వేస్తోవొస్తున్నారు. తల బాగాయెత్తి చూస్తే ! కాని తను కదిలినట్లు తెలీదూ ? యింకా వొస్తున్నారు, కొంచెం దూరమే, చెయ్యిజాస్తే తగిలేట్టున్నారు. సుబ్బారావు అనుకుంది. దగ్గిరిగా ప్రక్కదగ్గిరిగా వొచ్చాడు. ఊపిరి పీలవడం వినపడుతోంది. అర్ధమయీ కాకా అర్ధ

మవుతోంది. మనసుకు తెలీదు, శరీరానికి తెలుస్తోంది, అతని రాకకి అర్థం. వొళ్లంతా లాక్కుపోతోంది. దొర్లాలి, లేవాలి, యేమన్నా చెయ్యాలి, ఎందుకిట్లా వూరికే వుంచుంటాడు ? యెంతసేపు ? యెందుకు వచ్చాడు మరి ! చీకట్లో తెల్లని మల్లుపంచ కళ్ళదగ్గిరిగావుంది. ఆమె శరీరమంతా కదలకుండా అతనివేపు జరిగింది. చేతులు వణికాయి. అతను కదులుతున్నట్టుంది. వూపిరాగింది. అతని వేళ్ళ కొనలు ఆమె నడుమును తాకాయి వొళ్ళంతా బిగుసుకుంది. కదలకుండా వుండడం దుస్సహం. నిట్టూర్పు విడిచాడు. చెయ్యి కదిలించింది. అతన్ని తాకడం, ఆ వేళ్లు అని పట్టుకోడం యెంతసుఖం. కాని అమితమైన సిగ్గూ, భయమూ కలిగాయి. చేతిని గట్టిగా మోపి వూయించాడు. అమ్మో ! కల మాయమయింది కదలక వూరుకుంది వూయించాడు.

"ఎవరు ?" అంది బిగ్గిరిగా.

వెళ్ళిపోతున్నాడు. అతను కదలగానే శూన్యంతోచినట్టయింది. ఇంతేనా ? అయిపోయిందీ ! వెళ్ళిపోతున్నాడే ! పక్కకి దొర్లింది. నిట్టూర్పు విడిచింది. చెయ్యి జాచింది. అతను చూడలేదు. తరవాత చాలసేపు రవణకి నిద్రపట్టలేదు.

మర్నాడు పొద్దున్న రాత్రిసంగతి రవణకి కలలాగు తోచింది. కాని తలుచుకుంటే సిగ్గు, కొంచెము న్యూనతా తోచాయి. సుబ్బారావు వెళ్లిపోయినాడు. రవణ త్వరలో అంతా మరిచిపోయింది.

## ౫

మళ్ళీ గోపాలరావు యెండాకాలపు శెలవలకి రావలసి వొచ్చింది. యెట్లాగనన్నా తప్పించుకోవాలని చూశాడు. ఒక స్నేహితుడితో తంజావూరిలో యెండాకాలం గడపటానికి యేర్పాటయింది; యింటికి రానని రాశేశాడు. రవణని మళ్ళీ వొక సంవత్సరం చూడననే దిగులు తోచింది — కాని కొత్త దేశం కొత్త స్నేహితులూ, అతన్ని ఆకర్షించారు. నారాయణా నరుసూ, పెట్టే బాధలు జ్ఞాపక మొచ్చాయి. కాని పాపం చివరికి ఆ స్నేహితుడి తండ్రి హఠాత్తుగా చచ్చిపోవడం వల్ల గోపాల్రావు యెత్తు సాగలేదు. విచారంతో యిల్లు చేరుకున్నాడు. కాని యీసారి నారాయణా నరుసూ పెట్టే బాధలు పడదలుచుకోలేదు. తన చర్యని, నమ్రతని, రవణ నిరంతరమూ చూస్తుందనే భావం గోపాల్రావుకి సహితం రోషాన్ని కలిగించింది. వాళ్ళిద్దరూ అల్లరి చేసినప్పుడల్లా చంపకాయలూ, గిల్లులూ, సాగించాడు. వాళ్లు రావమ్మతో చెప్పుకున్నారు. కాని వాళ్ళ అల్లరిమూసి అమ్మ యేమీ అనలేకపోయింది. కాని

''పిల్లల్ని వృథాగా కొట్టడం వొకటి చాతనవును. చిన్నపిల్లలు వాళ్ళకేం తెలుసు?'' అంటుంది.

అయినా ఆ పిల్లలకి గోపాలరావు, యీ యాచకుడు, తమకు యెదురు తిరిగినందుకు కోపమెక్కువై అతన్ని దొంగతనంగా యేడిపించేందుకు—కొత్త పద్ధతుల్ని కనిపెట్టారు. అసలు అతనిమీద కోపమే కాకుండా అల్లరిమీద అభిలాషా,

శత్రువిజయ ప్రోత్సాహమూ, వాళ్ళకి తోడ్పడ్డాయి. అతను లేకుండాచూసి అతని ట్రంకు పెట్టలు పోగొట్టడమూ, దణ్ణెం మీాది అతని చొక్కాలకి చిల్లులు చెయ్యడమూ, అతని కలంపాళీ చిట్లకొట్టడమూ మొదలైనవి ప్రారంభించారు. యెవరితో చెప్పుకుంటాడు బీద గోపాలావు! అతని బతుకు కష్టతరమయింది. చివరకి అతని కాలేజీ లైబ్రరీపుస్తకంలో పదిపేజీలు అడ్డంగా చించారు. అతను దాని ఖరీదెట్లా యిచ్చుకుంటాడు. అతని వాళ్ళుమండి, దుఃఖంపట్టలేక, ఆ పుస్తకం వెంకన్న పంతులుగారి ముందు పెట్టాడు. అసలు వెంకన్న పంతులు గోపాలావుతో మాట్లాడ్డమే మానేశాడు. యింక యే యేడాదికో రెండేళ్ళకో, రవణని తనదగ్గిర్నించి తీసుకుపోతాడనే కోపం ఆయనకి తెలీకుండానే మనసులో పనిచేస్తోంది.

"మీా అబ్బాయిలు యేంచేశారో చూడండి. యెన్ని చిలిపిపనులు చేసినా వూరుకున్నాను. యిప్పుడు యీా పుస్తకం ఖరీదు యెవరిస్తారు?"

"పాపం! యిన్నాళ్ళూ నువ్వు వాళ్ళకేమీా చెయ్యనే లేదు కదూ!"

"మరి వాళ్ళు నన్ను పెడుతున్న బాధలో!"

"సరిపోయింది.

"కాని యీా పుస్తకం ఖరీదు యిరవై రూపాయలు. మీారిస్తారా ఖరీదు?"

చంటిపిల్లల్లో ఆడుకుంటున్న వెంకన్నపంతులు మాస్ట్రీలు పదవి నలంకరించాడు చప్పున.

"వాళ్లు చింపగా నువ్వు చూశావా!"

"యింకెవ్వరున్నారు!"

మాస్ట్రీలు కాకముందు వెంకన్నపంతులు కొన్నాళ్ళు మాష్టరు పనిచేశాడు.

"యెక్కడ పెట్టావు!"

"నా పెట్టిమీద."

"అంతఖరీదైన పుస్తకాలు దాచుకునేందుకు చోటు అదా! యెవరుచింపారో! నువ్వేచింపి వాళ్ళమీద పెడుతున్నావేమో!"

గోపాలరావు కళ్ళవెంబడి నీళ్లు తిరిగాయి.

"అయినా అంత పుస్తకం చదవాలనే తీసుకొచ్చావు? నీవుసొంతం వొకటి చదివావు గనకనా! సరిగా చదివితే ఆ 'స్కాలర్‌షిప్' రానేవొచ్చేది. (తనకి జీతం నెలకి పదిహేను రూపాయలూ తగ్గేది) యింతా ఖర్చుచేసి నిన్ను చదివిస్తూ వుంటే (వెంకన్నపంతులు యెఫ్. ఏ. మూడేండ్లు బి ఏ. ఒక యేడు ఫైలైనాడు. అడిగేవాళ్ళేవరు!) ఆఖరికి, యిప్పుడు నేర్చుకునే బుద్ధులూ చదువే, చదువు! ఆపిల్ల యెక్కడ యేంచేస్తోందా అని తొంగి చూడ్డంతో సరిపోతోవుందిగాని నీకు చదువుకూడానా!"

గోపాల్రావు పెదిమ కొరుక్కుంటో నుంచున్నాడు.

"ఇట్లయితే నేనిక్కడ వుండడం కష్టమండీ!" అని సంకోచంతో అనేశాడు.

"నిన్నిక్కడ వుండమని బతిమాలానా! "

గోపాలరావు తల గిర్రున తిరిగింది. చప్పున హాలులోకి వొచ్చి కూచున్నాడు. యేం చెయ్యాలి? యెక్కడ దిక్కు! తనూ తల్లీ వెళ్ళిపోవాలి రవణకూడానా! యెక్కడా గతిలేదని అతనికి నిమిషంలో స్పష్టమయింది. యెక్కడన్నా గుమాస్తాగా చేరితే. యెవరిస్తారూ! యిక్కణ్ణుంచి కదిలేదెట్లా! వెంకట్రావుగారికి రాయడం పిగ్గేసింది. ఐనా వారంరోజుల్లో పట్నం యెట్లానూ వెళ్ళాలి కళ్ళు మూసుకుంటే. కాని వెళ్ళేప్పుడు ఆ వెంకన్నపంతులు దగ్గిర్నించి డబ్బు తీసుకోడం యెట్లా! యిట్లా ఆలోచించుకుని, ఆలోచించుకుని, తన దౌర్భాగ్యానికి యేడ్చి అలిసిన ఆదిక్కులేని హృదయాన్ని నిద్ర కావలించుకుంది. అతనికీ వెంకన్నపంతులికీ జరిగిన సంభాషణలో చివరిభాగం విని బాధపడి, వెంకన్నపంతులు దీపం తుడవక, నీళ్ళియ్యక, దొడ్డివేపున అతని దౌర్భాగ్యానికై కన్నీళ్లు కారుస్తున్న ఒకకన్య హృదయం వుందని తెలిస్తే గోపాలరావుకి కొంత శాంతి వొచ్చివుండును. కొంతసేపటికి కళ్ళు తెరిచిచూస్తే రాత్రైనట్లుంది. అక్కడే చాప పరుచుకుని పక్కవేసి మళ్ళీ యేడ్చాడు. యీ పెళ్లెందుకు చేసుకుని, వీళ్ళకింద బిచ్చగాడనై పడ్డానా! ఆస్కూలు ఫైనలవగానే యెక్కడో గుమాస్తాపని చూసుకుంటే యెంతో ఆనందముగా

వుండునే జీవితమూ అనుకుని. మళ్ళీ రవణ జ్ఞాపక మొచ్చి, ఆ ఆలోచనకి సిగ్గుపడి, దిగులుపడి యింకా రెండేళ్లైనా గడపటం అనుకుంటో నిద్రపోయినాను. పదిగంటలయింది. అందరూ భోజనాలుచేసి యెవరిగదులకి వాళ్ళు వెళ్ళారు. వెంకన్నపంతులు చదవటానికి రమ్మంటే రవణ తలనొప్పి అని వంకపెట్టి వెళ్ళలేదు. గోపాల్రావుని భోజనానికి పిలవమని సిగ్గువిడిచిచెప్పి అప్పమ్మని పనుపార్లుపంపింది. అతను రాలేదు. రవణ వూరుకోలేకపోయింది. తనకోసం యీగదిలోపడి యేడుస్తున్నాడు పాపం!

పెళ్ళికాగానే రవణ యింక తనకి అతనే రక్షకుడు నాథుడు అనుకుంది. కాని క్రమంగా అతని అసహాయత్వం చూసి, క్రమేపీ అతడే తనవాడైనట్లు అతన్ని తానే రక్షించవలసినట్లు, ధైర్య మివ్వవలసినట్లు తోచింది. అతని హీనత్వమూ, నమ్రత, యాచకబుద్ధి, యితరులలో చూస్తే ఆమెకి పరమ అసహ్యం కలిగివుండును. కాని తన భర్తలో కనపడితే ఆమెకి విచారమూ దయా, ప్రేమా కలిగాయి. అతనిబాధ, అసహాయత్వం చూసి క్రమేపీ మాతృవుద్రేకం వుదయించింది. అట్లాపడిదిక్కులేక ఏడుస్తున్న తనభర్తని చూసి ఆగలేక, మెల్లిగావొచ్చి, అతని పక్కన నుంచుని,

"అన్నానికి లేవరూ?" అంది

ఆ కంఠం వినేప్పటికి గోపాల్రావు తలయెత్తి చూశాడు. బైట లాంతరుగుండావొచ్చే వెలుతురులో పసుపు

పచ్చ కాళ్ళు,నీలం కుచ్చెళ్ళూ కనపడ్డాయి. పెద్దసిగ్గొచ్చింది. మాట్లాడకుండా తల ముణుచుకొని పడుకున్నాడు.

"నేను పిలుస్తున్నాననినా రారూ?"

అతని వ్యసనమూ, ఆకలీ, బాధా అన్నీపోయి పెద్ద సంతోషం వొకటి వొచ్చింది.

"నేనింకా అన్నం తినలేదు."

ఆ నిముషాలు యింకా దీర్ఘం కావాలనిపిస్తోంది. తననించి సిగ్గుపడే యీ భర్తను చూసి; రవణకి జాలి యెక్కువైంది. ధైర్యమెక్కువయింది.

"మీరన్నంతిన్నదాకా నేను తినను."

అతని మెడమీద ఒక వేడినీళ్ళచుక్క పడ్డది.

"వెళ్లు, వొస్తాను"

విస్తట్లో, అప్పుడే వేగిన రెండు వొడియాలున్నాయి. అన్నంతింటో తల్లితో—

"నేనింక యీయింటో వుండను. ముష్టెనుక్కుని బతుకుతానుగాని, యీనీచపుబతుకు బతకను"

"ఈ రెండేళ్ళూ అజ్ఞాతవాసంగా కానీ నాయనా, పూర్వజన్మంలో యేం పాపం చేసుకున్నామో వీళ్ళ చేతుల్లో పడ్డాము. నాకు యీ చాకిరీ యేమిటిచెప్పు, మొగపిల్లాణ్ని చ్చుకుని పైగా వంట చాకిరీ! నా చుట్టాలా పక్కాలా!"

"ఆ పుస్తకం చూడు, దానిఖరీదు యిరవై రూపాయలూ యెట్లాయిచ్చుకోను! రేపెట్లా కాలేజికి పోను!"

కళ్ళంబడి నీళ్ళు కారాయి. అన్నం తినలేకపోయినాడు.

రవణకి వెంకన్నపంతులు మీద చాలాకోప మొచ్చింది. ఆయన మొహం చూడడమూ, ఆయనకి పనులు చెయ్యడమూ, కష్టమనిపించింది కాని తనభర్త పక్షం వహించిందని అనుకుంటారనే సిగ్గువల్ల, పనులు చేసింది కాని, యెంత ప్రయత్నించినా, సరిగా సంతోషంతో మాట్లాడలేక పోయింది. మర్నాడు మధ్యాహ్నం గోపాలరావు యెవరినో,

"నాట్రంకు కొంటావా? నాకలం కొంటావా?" అని అడగడం వింది. మొదట రవణకి నవ్వొచ్చింది. ఆ సొట్టలు పోయిన పాత ట్రంకు పాళీ విట్లిన కలం యెవరు కొంటారని! కాని అతని ఆతురతలో గర్భితమైన నిరాశ. విచారమూ, స్ఫురించి యెంతో విచారం కలిగింది. ఆ యిరవై రూపాయలూ యెలాగో అతనికి సంపాయించి యివ్వాలి యెట్లా? యెవరిస్తారు? ఈ వెంకన్న పంతులెందు కివ్వడు? తనపిల్లలు చెయ్యకపోతే, యెవరు చేస్తారాపని? ఆ నారాయణా నరుసు మీద అధికమైన కోపం కలిగింది. పైగా అబద్ధం చెప్పడం. అల్లరి అల్లరితో ఆగాలిగాని, యిట్లాంటి పనులా! వాళ్లు చింకారని రూఢిచేస్తే వెంకన్న పంతులిస్తాడు. యెట్లా రూఢిచెయ్యడం? గోపాలరావు విచారంతప్ప ఆమె కింకేమి కనపడ్డంలేదు. ఆలోచించింది. యెట్లాగనన్నా వాళ్ళని వొప్పించాలి. నారాయణే చేసివుంటాడీపని!

నాలుగురోజు లయింవి. గోపాల్రావు చెన్నపట్నం వెళ్ళబోతున్నాడు. ఇంకా పుస్తకం ఖరీదు యివ్వలేదు. రవణ ధైర్యంచేసి, సిగ్గుచంపుకొని.

"మరి ఆ పుస్తకం ఖరీదు యివ్వరూ!"

"ఖరీదు! ఖరీ దెందుకివ్వాలి!"

"మరి నారాయణ చింపలా!"

"యెందుకు! వాళ్ళకంటేట్టు యెందుకు పడేయ్యడం!"

"మరి యెట్లా!"

"యెట్లానూ లేదు." అని

ముఖం తిప్పేసుకున్నాడు. అట్లా తిప్పేసుకున్న తరువాత యింక వెంకన్న పంతులుతో లాభం లేదని సిరద్దారుకీ తెలుసు, రవణకీ తెలుసు. యీ అన్యాయం, క్రూరత్వం రవణ నధికంగా బాధించింది. అప్పటికీ యింకోరి విషయమైతే, ఆయనతో తర్కించేదే కాని, యీవిషయమై మాట్లాడ్డానికి అభిమాన మెక్కువయింది. ఆ రెండుమూడు మాటలు మాట్లాడ్డమే కష్టమైపోయింది. రవణకేమీ తోచలేదు! చాలా న్యూనతా, రోషమూ, కలిగాయి. కాని పైకి యేమీ చూపక వూరుకుంది. గోపాలావుకి పుస్తకం మనోవ్యాథ అయింది. కాలేజీకి పోనని, యెక్కడికో పారిపోతానని, బైరాగుల్లో కలుస్తాననీ అతను అనడంవింది. మర్నాడు సాయంత్రం దీపం వెలిగించడానికి వెంకన్నపంతులు గదిలోకి వెళ్ళినప్పుడు అతనిబల్లమీద కి రెంసీనోట్లు కనపడ్డాయి. అప్పు డప్పుడు అట్లా అతను వొదిలేసి వెళతాడు. ఆయింట్లో యెప్పుడూ దొంగతనమన్న మాటలేదు కనక అనుమానాలతో నిండిన వెంకన్నపంతులు మనసుకూడా యీ విషయమై

అశ్రద్ధ వహించింది. ఒక్క నిమిషంలో ఆలోచించడానికైనా వ్యవధిలేకుండా చప్పున, రెండు పదిరూపాయలనోట్లు తీసి దాచేసింది. వెళ్ళి అర్ధారాత్రే గోపాలరావు పుస్తకంలో చినిగిపోయిన పేజీలదగ్గిర ఆ నోట్లని పెట్టేసింది. తను తప్పు చేశానని రవణ కేమాత్రమూ లేదు. ఆ రూపాయలతని వే. తాను యిచ్చేసింది, వాళ్ళివ్వరుగనక.

అరగంటలో వెంకన్నపంతులు నోట్లుపోయిన సంగతి కనుక్కున్నాడు. సరిగా యిరవైపోవడం అతని కనుమాన మేసి, గోపాలరావు సామానులన్నీ వెతికించాడు. దాంతో బాటు పనివాళ్ళనికూడా బెదిరించాడు. గోపాలరావు పుస్త కంలో నోట్లుదొరికాయి. వెంకన్న పంతులతన్ని పిలిపించి,

ముందు బాగుపడవలసినవాడివి. యిల్లాంటి బుద్ధులు నేర్చుకున్నా వంటే పాడైపోతావు. నువ్వు పాడైతే పాడై నావు. నీభార్యనీ సంసారాన్నీ పాడుచేసుకుంటావు. యింకో క్కయితే. చివరకి నా కొడుకైనాసరే పోలీసువాళ్ళకి వప్ప చెప్పి వుందును; కాని తండ్రిలేని ఆ పిల్లని తలుచుకుని నిన్ను వొదిలేస్తున్నాను!" అన్నాడు.

"మళ్ళీ యింకోసారి నేనేమి యెరుగనని చెపుతున్నాను. యిట్లాంటివి నేనెప్పుడూ చెయ్యలేదు. నేనెల్లాంటి వాణ్నో వెంకటరావుగారికి రాసి తెలుసుకోవచ్చు."

"చాల్లే వూరుకో; అబద్ధంచెప్పి ..."

రవణ లోపలికివచ్చి, వొంచిన తలతో

"ఆ రూపాయలు తీసింది నేను. ఆయన పుస్తకాన్ని నారాయణ చింపాడు. ఆ ఖరీదు మీరు యిచ్చివుండవలసింది; యివ్వలేదు. అది అన్యాయం. ఆయన మెక్కణ్ణించి తెచ్చి యిచ్చుకుంటారు ? అందుకని నేనే తీసికెళ్ళి ఆయన పుస్తకంలో పెట్టాను పెట్టాననికూడా ఆయనకి తెలీదు. ఆయనేమీ అనకండి'' అంది.

వెంకన్న పంతులు చిరునవ్వుతో గదిలోనించి వెళ్ళిపోయినాడు. ఆయన వెళ్ళిపోగానే గోపాలరావు చాలా కోపంగా గదిలోనించి వెళ్ళిపోయినాడు.

ప్రతి మనిషికీ పాపాలన్నిటిలోనూ తనలోగాని యితరులలోగాని సహించని పాపం వొకటివుంటుంది. సాధారణంగా వారిస్థితిలో వారికి యెక్కువగా చెయ్యాలనిపించే పాపమే ఐవుంటుందది. వర్తకుడికి మోసమూ, భర్తమీద ప్రేమలేని భార్యకి వ్యభిచారమూ, పిల్లలకిదొంగసాక్ష్యమూ, సిపాయికి పిరికితనమూ, మొదలైనవి. యితరపాపాలు చేశారంటే వూరుకుంటారు. ప్రత్యేకించి ఆ పాపం చేశారనగానే మండిపడతారు. అట్లానేగోపాలరావుకి దొంగతనమంత ఘోరమైన పాపంలేదు తనుచెయ్యడు. ఇతరులలో అపని సహించనూలేడు. బీదవాడు కావడంచాతనూ, యితరుల యిళ్ళలో పెరగడంచాతనూ, అతనికిఆస్తివిషయమైన నీతిగొప్పదయింది.

తాముచేసిన దుష్కార్యం కలగచేసే అంతరాత్మబాధని, అదుష్కార్యం చెయ్యవొద్దని బోధించడంవల్లనయం చేసుకునేవారు కొందరు. ఒకచావుముందు విల్లు 'రిజిస్ట్రీవకా కి'

వాళ్లి తే అన్యాయంచేసి, న్యాయసత్యం తప్పించి, యాభై వేలు సంపాయించి 'పిన్షను' పుచ్చుకున్న రిజిస్ట్రారాయన అ వ్రాలో్యపుండేవాడు. ఆయనిన్ని సూర్కులు జీతం యాచించడానికి గోపాల్రావు పూర్వం వెడితే —

"ఇదుగో! అబ్బాయ్, నువ్వుమాత్రం లంచాలు తీసుకోకు. సూర్కులు ఫైనల్ ప్యాసై పనిలో ప్రవేశిస్తావు! అప్పుడు లంచాలిస్తామని వొస్తారు, తీసుకోకు. అంతపాపం యింకోటిలేదు." అని ప్రతిసారీ చెప్పేవాడు.

ఆ విధంగా నీతులు వినివిని వుండడంచేత, గోపాల్రా వుకి చాలా నీతివర్తన కలిగింది. కనుక వెంకన్నపంతులు తన మీాద దొంగతనం కడితే యెక్కడలేని రోషమూ వొచ్చింది దతనికి. చివరికి రమణ తనే దొంగతనం చేశానసే టప్పటికి అతను విభ్రాంతపోయాడు. తనకోసం చేసిన త్యాగమని తోచింది. కాని ఆ భావాన్ని పైకిరానీలేదు. యీా దొంగ తనంమీాద కోపం దాన్ని అణగతొక్కింది. అదిగాక తన కోసం దొంగతనంచేసి అది వొప్పుకునేటంత త్యాగం చేసింది తన భార్యఅని తనకి తానే వొప్పుకుంటే తన కెంత న్యూనత? భార్యచేత సహాయం చేయించుకో వలసిన గతి పట్టిందని వొప్పుకోడు. అదిగాక అంత ఉపకారభారం భరించడంకూడా దుస్సహామే.

యీా ఆలోచన లన్నిటినీ, ఆమె త్యాగాన్ని, ఉదా రాన్ని దొంగతనం చేసిందనే కోపంలోముాడ్చి ఆమెవైపు

తృణీకారంగా చూసి, రైలుయింజనుకంటే యెక్కువగా పుందుతో రైలెక్కి పట్నం వెళ్ళాడు గోపాలరావు.

సాయంత్రం రవణసాహితి ముందుపెట్టుకొనికూచుంది. గుమస్తానిపంపి వెంకన్నపంతులు గదిలోకి వొచ్చి, రవణభుజం మీద చెయ్యేసి -

"అతనిమీద అప్పుడే అంత ప్రేమా! నువ్వు చేశావంటే మాత్రం నేను నమ్ముతానా! అతన్నేమీ అననులే, పిచ్చిపిల్లా!"

వెంకన్నపంతులు ప్రతిరోజూ అబద్ధం నిజంగాచెప్పే సాక్షుల మొహాలు, కరణాల మొహాలుచూస్తూ వుండడంచేత ఆయనికి నిజంచెప్పే మొహానికీ చెప్పనిదానికీ భేదం కనుక్కునేసహజశక్తి నశించింది. సాక్ష్యబలంమీద ఆధారపడడమే గాని మనిషిస్వభావంమీద ఆధారపడడం మానుకున్నాడు. అదిగాక రవణమీది ప్రేమచేత ఆమె ఆపని చేసిందని వొప్పుకోవడం అతనికిష్టంలేదు. రవణే ఆపని చేసిందంటే ఆ పని చెయ్యవలసిన అవశ్యకతా, తనఅన్యాయమూ, అన్నీ వొప్పుకోవలసి వొస్తుంది. కనుక తన లోభత్వం గోపాలరావు చేసిన కార్యంమీద ద్వేషంలో దిగమింగి, అతను వూరుకున్నాడు. యింతాచేసి, గోపాలరావుకి సొమ్ము యిప్పించలేక, అతనిమీది అపవాదునూ తొలిగించలేక తనకోపమూ తన ప్రేమా, తనత్యాగమూ, అన్నీ నిరర్థకములైనా, లోపలనే అణచుకుని నిత్యజీవనం గడుపుతోంది రవణ.

## ౬

ఫిబ్రవరి నెలలో రావమ్మ మళ్ళీకన్నది. సాయంత్రం ఆ రోజంతా వాన. అయిదున్నరకే చీకటిపడ్డది. నొప్పులు పడుతూ పగలంతా పెద్దగదిలో పడుకుని కేకలేసి, చివరికి అలసి పడుకుంది. ప్రతికానుపుకూ యిట్లా మూడు నాలుగు రోజులు బాధపడడం మామూలే యింకా కానుపులక్కర్లే దని ప్రతివారితోనూ అనడం, మళ్ళీకనడం మామూలయింది ఆమెకి- ఆరోజురాత్రి డాక్టరుగారింటికి గృహప్రవేశ భోజనా నికివెళ్ళి యింటికి రాత్రి పదిన్నరికి వొచ్చాడు వెంకన్న పంతులు. పట్టుబట్టవిప్పి పంచకట్టుకోడానికి వెడితే దీపంలేని ఆఫీసుగదిలో కుర్చీమీద కూచుని బల్లమీద చేతులు పెట్టు కుని రవణ నిద్రపోతోంది. ఆమె మెడవరకు వెన్నెల పడు తోంది తలంటి పోసుకుని వొదులుగా జడవేసుకున్న జుట్టు గుబురుగా చేతులమీద వేళ్ళాడుతోంది. పిరుదులదగ్గిర్నించి మెడవరకు సాగే ఆ వొంపుల్ని, ఆ అమాయకత్వాన్ని. నూతనత్వాన్ని, వెన్నెలలో ఆ చర్మంలో కనపడే కొత్త యవ్వనపు మెరుపునుచూసి, వెంకన్నపంతులు మనసులో సంచలనం కలిగింది. బల్లకి వొత్తుకోకుండా ఆమె రొమ్మును తప్పించాలనిపించింది. యిన్నాళ్ళూ ఆమె మీదవుండే పితృ వాత్సల్యం గృహప్రవేశ భోజనంతో అడుగునపడి, యింత అందమైనదాన్ని యిన్నాళ్ళు యెట్లా గుర్తించలేదా అను కున్నాడు వెంకన్నపంతులు. ప్రపంచంలో స్త్రీలు లేరు, ఆ రావమ్మతప్ప — అందరూ కరణాలూ, కలెక్టర్లూ, గుమా

స్తాలూ, కాయితాలే. లోకం ప్రకారం దుర్నీతి అతనిలో యేమీలేదు. ఆ ధ్యాసేలేదు. ఆ వాంఛ వచ్చినప్పుడు భార్య వుంటేచాలు. కాని యింకా చావని కొన్ని రసభావాలూ, సౌందర్య పిపాసా కొంచెంగా వుంది. అది యీ రాత్రి విజృంభించింది. యేంచెయ్యాలనివుందో, యేంచెయ్యబోతున్నాడో అతనికే తెలీదు. మెడకింద చెయ్యేసికదిలించాడు.

"యిక్కడపడుకున్నావేం ?" అన్నాడు రహస్యంగా.

వెంకన్నపంతులికి తెలుసు రావమ్మ లేచిపిలుస్తే పలకడానికి దగ్గరగా వుండాలని అక్కడ పడుకుందని! రవణ లేచి కళ్ళు తెరిచిచూసి నుంచోబోతోంది. పంతులు చేతులు ముందుకు వస్తున్నాయి; వెనక్కు తగ్గుతున్నాయి తను ఆమెను పట్టుకుందామనే అనుకుంటాడు చేతులెత్తలేదు, యింకా కళ్లు నలుముకుంటోనే వుంది. యీమంటుందో, వొప్పుకుంటుందా ? అరిస్తే! తిరగబడతే! యేంచేస్తుంది ? యీమంటుంది ? సిగ్గుకదూ ? యెవరితో చెప్పుకుంటుంది ? తన విషయమై నమ్ముతారా! ఐనా యెవరున్నారు చెప్పుకోవడానికి ? దాని మొహం అదేం చేస్తుంది ! వూరికే యెందుకు తిండి పెట్టాలి ! నుంచుంటోంది. వీపు వెనకనించి చేతులేసిపట్టుకుని దగ్గిరికి లాక్కుంటున్నాడు. రవణకి అర్థమైనట్టులేదు.

"ఎక్కడికి ?" అంది.

నోరుగూడ నోరుపెట్టాడు. యాలకాయల వాసన వేసింది. జుట్టు కొత్త శీకాయ వాసనవేసింది. రబ్బరుమల్లె

వకుము, వెచ్చగా చెయ్యికింద సాగుతోంది. యేఅర్ధరాత్రో ఎముకలకుప్పని, రావమ్మని కావిలించుకోడాని కలవాటుపడ్డ వెంకన్నపంతులి కది స్వర్గంలాగుంది రవణ దూరంగాజరుగుతోంది, వొదిలించుకుంటోంది పట్టుకుని బలాత్కరించేధైర్యం లేదు పంతులికి. రవణ వెళ్ళిపోయింది.

తెల్లవారి రాత్రిజరిగింది నిజమా కలా అని యిద్దరికీ ఆశ్చర్యం వేసింది. యాభై యేళ్ళ ముసలివాణ్ణి నాకట్లాంటి బుద్ధి యెట్లా పుట్టిందని అతనికీ, అతనంతపని చేసివుంటాడా, తన దురూహే మోనని రవణకీ అనిపించింది.

## 8

వెంకట్రావుగారు వొస్తున్నారని ఆయన్ని చూడ్డానికి శెలవలకి యింటికి వొచ్చాడు గోపాల్రావు; లేకపోతే యామైనాసరే వొచ్చేవాడు కాడు వెంకట్రావుగా రుండటంవల్ల గోపాల్రావుకి గౌరవం యెక్కువయింది. ఒకరోజు వెంకట్రావు గారితో గోపాలరావు తనకు తటస్థించిన కష్టాలూ, అవమానాలూ చెప్పుకున్నాడు. ఆ యెండాకాలపు శెలవలంతా గోపాల్రావుని తనతో తీసికెళతానన్నా డాయన.

ఒకరోజు మధ్యాహ్నం కాఫీయిస్తోండగా వెంకట్రావు రవణతో,

"యేమమ్మాయ్, మీఆయన్ని నాతో తీసుకెళుతున్నాను" అన్నాడు.

రవణ చిరునవ్వు నవ్వింది.

"నామీద కోపం లేదుకద !"

"యేమ్పూను కక్షతాను !"

"బందను."

రవణ మొహంలో సంతోషమూ చప్పిన దుఃఖమూ కనపడ్డాయి.

"అవును అది మీనాన్నగారి వూరుగనూ ! ఆయన అక్కడే పనిచేశారు. నే నొకసారి వచ్చి ఆయన్ని చూశాను. నీవు చిన్న పిల్లవి. నేను జ్ఞాపకం వుండివుండను

"నాన్నగారినిచూడ్డానికి పైవాళ్ళు రోజూ నలుగు రైదుగురు వొచ్చేవాళ్ళు, జ్ఞాపకం పెట్టుకునేదెట్లా? ఐతే ఎవరూ నన్ను పలకరించకుండా వెళ్ళేవారు కాదు"

"అవును. అంత గొప్ప ఆదర్శాలూ, కార్యోత్సాహం. త్యాగంవున్న మనిషిని చూడలేదు నేను"

తన తండ్రి శ్లాఘనతో రవణ హృదయం వెంక ట్రావుగారిదై పోయింది

"ఇల్లారా. కూచో. యిక్కడ బావుందా నీకు?"

"ఆ"

ఆ రాత్రి వెంకన్నపంతులు చేసిన పనీ, గోపాలావు తిప్పలూ జ్ఞాపకం వొచ్చాయి.

"కాని..."

"చెప్పు"

"ఏం లేదు. బాగానేవుంది."

"గోపాలానికి బావుండలేదుట."

"అవును"

"నువ్వూ చూస్తున్నావుగద!"

"ఊఁ"

"మరి నేను అతన్ని తీసికెడితే, నీకు యాడాద్దాకా కనపడడు"

దిగులుగా చిరునవ్వు చూపింది.

"పోనీ, నువ్వుకూడా వొస్తావా?"

సంతోషంతో కళ్ళు తళతళలాడాయి.

"కాని రానిస్తారా?"

"ఎందుకు రానియ్యరు?"

"పని?"

"ఏం పని? ఆ రావమ్మ యేంచేస్తుంది? ఎల్లకాలం నువ్వే చేసిపెడతావా!"

రవణ వెళ్ళడానికి వెంకన్నపంతులి కేమాత్రం యిష్టం లేదు. కాని వొద్దనడానికి కారణ మేం చెబుతాడు?

రెండురోజుల్లో ఒక మధ్యాహ్నం బయలుదేరారు. బండిలో రవణ మొహం కలకలలాడుతోంది. గోపాలరావుకి సంతోషం పొంగిపోతున్నది. ఈ రావమ్మ, ఉరాళ్ళూ, చీకటిపాలూ, ఆ పాతమంచం, అన్నీ, తామూ బైలుదేరుతూనే కిందపడి దొర్లి యేడ్చే నారాయణా, నరుసూ, అరు

పులు, మంగళవాద్యాలుగా వినబడుతున్నాయి అతనికి. కాని దయదలచి వాళ్ళని కూడా రమ్మనరుకద అని భయ వేసింది. "వాస్తేనేం రానీ, బందగు సంగతి చూపిస్తాను." అనుకున్నాడు. ఒక మల్లుపంచకట్టి మోకాళ్ళవరకు వొచ్చే నల్లచారల కోటు వేసి, పాత ఫెల్టుక్యాప్ నెత్తిమీద పెట్టి మరచెంబుతో నడుస్తున్నాడు బండి వెనక. బండిలో యెక్కి నప్పట్నుంచి రవణ వాళ్ళల్లోంచి వొచ్చేసి తనదైపోయినట్లు కనపడ్డది.

ఇంక తనతో స్నేహంగా వుండకుండా యెవరడ్డు యెస్తారు? ఇన్నాళ్లు తను రవణతో మాట్లాడ్డానికి ప్రయత్నించినట్టూ, ఆ యింటివాళ్ళందరూ అభ్యంతర పెట్టినట్టూ. తోచింది అతనికి. బండిలో కూచున్న రవణని కళ్ళెత్తి తనివి తీరా అప్పుడప్పుడు చూచి, "ఇంత అందమయినదని యెన్నడూ అనుకోలేదే. నాకు నిజంగా యింత అందమయిన భార్యవుందా. నిజంగా నాదేనా ఆ సౌందర్యమంతా" అనుకున్నాడు చాలాసార్లు.

రైల్లో తనెక్కడ కూచుంటాడు? వెంకట్రావుగారూ భార్యా సెకండుక్లాసులో వెడతారు. ఇదివరకు తనూ తల్లీ మూడోక్లాసులో వెళ్ళేవాళ్ళు. ఇప్పుడు రవణకికూడా మూడోక్లాసే కొంటారుగా! రవణని తమతో యెక్కించుకోరుగద! మూడోక్లాసు కిక్కిరిసి వుంటుందేమో? దగ్గిరిగా కూచుంటుందా? రాత్రి యెక్కడ నిద్రపోతుంది? తన తొడ మీద తల పెట్టుకుంటే! ఒకవేళ ఆడవాళ్ళ పెట్టెలో యెక్కి

స్తారేమో!... ... వెంకట్రావుగారు నాలుగు సెకండుక్లాసు టిక్కట్టు కొనమని డబ్బిస్తే గోపాల్రావు కేమీ సంతోషం కలుగలేదు. తెలిసిన వాళ్ళిద్దరితోటే కూచోవలసి వచ్చింది. ఇంక ఇంటికెళ్ళింతరువాత ఎట్లానూ కనపడరు. రైల్లోనన్నా స్నేహం చేసుకోవాలంటే! రైలెక్కారు; పెట్టె అంతా వీళ్ళకే ఖాళీ. ముందు మంగమ్మా రవణా యెక్క ఒక పరుపుమీద కూచున్నారు. వెంకట్రావుగారుకూడా వాళ్ళప్రక్కనే కూచున్నారు. గోపాలరావు ఎదురుగా యెండలో కిటికీదగ్గరగా కూచున్నాడు. వెంకట్రావుగారు కొంచెంసేపు కబుర్లు అడిగి తరువాత చదువుకుంటున్నారు. మంగమ్మ కిటికీలోంచి చూస్తూ అప్పుడప్పుడు రవణతో మాట్లాడుతోంది. గోపాలరావు వీలైనప్పుడల్లా రవణకేసి చూస్తున్నాడు. రెండు మూడు స్టేషనులైన తరువాత మంగమ్మ.

"నడుం వాల్చుకుంటా, మీరు దానిమీదికి వెళ్ళండి" అంది వెంకట్రావుగారిని

ఆయన రవణతో మువ్వుకూచో అమ్మా. అట్లా అతను వొక్కడూ యేం తోచక కూచున్నాడు. ముసలిదాని కబుర్లు యెంత సేపని వింటావు !" అన్నాడు.

రవణ సిగ్గుతో కదల్లేదు. గోపాలరావు గుండెలు కొట్టుకుంటున్నాయి. తనవంక వొక్కసారి చూడకుండా, తను లేనట్లే ప్రవర్తిస్తున్న రమణమీద యింతాకణ్ణించి రగుల్తున్న కోపం చల్లారింది. కాని యిప్పుడైనా కదలదేం! మళ్ళా యెవరూ మాట్లాడలేదు. వెంకట్రావుగారు మళ్లీ చదువు

కుంటున్నారు. ఆ మంగమ్మ నడుంనొప్పి యేమయింది! మాట్లాడదేం! ముసలిది ఆమె కెంత వోపిక! ఆయనకా మతిమరుపేమిటి! కొంచెం యిటూ అటూ కదిలాడు. తన నడుం కొంచెంచాచి మంగమ్మకిచెప్పి జ్ఞాపకం చేయాలని చూశాడు. లాభంలేక కొంతసేపున్న తెరువాత వెంకట్రావు గారే పుస్తకం సించి కళ్ళెత్తి.

"యింకా వెళ్ళలేదు!" అని రవణ జబ్బపట్టుకుని, తీసుకొచ్చి సిగ్గుతో కుంగిపోతున్న దాన్ని, గోపాల్రావు పక్కన కూచోబెట్టాడు. అమాంతంలేచి వెంకట్రావుగారిని కావిలించుకొని కాళ్ళమీదపడి, ఆయనకి మహోపకారాలు చేసి ముసలితనంలో తనే పోషించి యింకేమేమో చెయ్యాలనిపించింది గోపాలావుకి. కాని అట్లాంటివేమీ ప్రస్తుతం మంచిది కాదని తోచినట్లుంది. అందుకని తలవొంచుకు కూచున్నాడు. వెంకట్రావుగారు చెయ్యివదలగనే పరుపు క్రింద 'స్ప్రింగు' తన్నినట్లు యెగిరి రవణ పరుపు చివర యెడంగా కూచుంది మంగమ్మ కళ్ళు మూసుకుంది. వెంకట్రావుగారు పుస్తక ప్రపంచంలో పడ్డారు. అప్పుడైనా వాళ్ళకి తెలీకుండా రవణతో స్నేహసంబంధం కొనసాగించే పద్ధతాలోచించాడు గోపాలరావు. వాళ్ళిద్దరివంకా చూస్తో బల్లకిందినించి కాలుజాచి రవణ కాలుకి తాకించాడు. కదలలేదు. బాటనవేలు గోరుతో. మడమగోకాడు. కాలు లాక్కుంది. కొంచెం ఆగి కిటికీ అవతలనించి తొంగి ఆమె మొహంకేసి చూశాడు. మొహం అటుతిప్పుకొని వుంది. దగ్గాడు. లాభంలేదు.

"అటుచూస్తే, రైలురవ్వలు కళ్ళల్లో పడతాయి"
అన్నాడు.

ధైర్యంచేసి, రవణ రవ్వలు కళ్ళల్లో పడేసుకునేందుకే రయిలులో ఎక్కినట్టు వాటివేపే చూస్తోంది. ఇంక కొత్త ఉపాయమేమీ తోచక వూరుకున్నాడు అప్పటికి.

రెండు చిన్నగుట్టల మధ్య వెడుతోంది రైలు. అస్త మిస్తున్న సూర్యుడి కిరణాలు గుట్ట వెనకనించి పక్కలకి చిమ్ముతున్నాయి. చిన్నపల్లె వొచ్చింది అరుస్తున్న గొర్రెల్ని పల్లెవేపు తోలుకుపోతున్నాడు గొల్లవాడు. సాయంకాలపు పొగలు పూరిగుడిసెల కప్పుల్లోంచి, గాలికి మెల్లిగా వంకర్లు తిరుగుతో, లేస్తున్నాయి. తనూ రవణా ఆ చిన్న అరుగుల్లో ఒకదానిమీద కూచునివుంటే యెంత బావుంటుంది! రవణ వంక చూశాడు. రవిక కింద గుండ్రంగా ఆమె చెయ్యి కన పడుతోంది. చీకటిపడ్డ తరువాత ఆ చేతిని గట్టిగా పట్టుకుంటే అరుస్తుందా! ఆవేళ రాత్రి అంత ప్రేమతో అన్నానికి లేవ మని అడిగిందే!

రైలాగింది. గోపాల్రావు ప్లాట్ ఫారంమీద షోకుగా నడవాలనే వుద్దేశ్యంతో తలుపు తీశాడు. మంగమ్మ

"ఎక్కడికి దిగుతున్నావు?" అంది. ఏం చెప్పాలో చప్పునతోచక,

"డబ్బులు పడ్డాయి" అన్నాడు.

ఇంక తిరగడ మేముంది! డబ్బులకోసం వెతికినట్టు వెతికి, "దొరికాయి!" అని

రైలెక్కాడు. రవణ నవ్వుకొంది.

చీకటిపడ్డది. రవణదగ్గరిగా జరిగాడు. అతనికి ఆకలి వేసింది. ఇల్లు జ్ఞాపకంవొచ్చి, ప్రస్తుతం ఆపీడ వొదిలిపోయింది కదా అని గొప్ప సంతోషం చప్పున స్ఫురించింది. పంజరం లోంచి బైటపడ్డ పిట్టకు కలిగే సాహసం గలిగింది.

"ఒసే" అన్నాడు,

తలెత్తి చూచి తిప్పేసుకుంది రవణ. తనధైర్యానికి తనే భయపడ్డాడు. తనతో రవణ మాట్లాడదని నిరాశ, తను లేనట్టే హాయిగా, నిశ్చలంగా వున్నదనే వుక్రోషం—వీటివల్ల ఆ సెకన్డు క్లాసులో సౌఖ్యమూ, సాయంత్రపు శాంతమైన గాలీ, మెత్తని వెలుతురూ, అతను అనుభవించనేలేదు. కోపంతో రవణ నుదుటిమీద జుట్టు లాగాలనుకున్నాడు. ఇటు చూశాడు. అటుచూశాడు చప్పున దీపం వెలిగింది వెంకట్రావుగారు 'స్విచ్చి' నొక్కారు. గోపాలరావు దూరంగా జరిగాడు.

నల్లని చీకటిని చీల్చుకుంటూ రైలు పరిగెత్తుతోంది. పెట్టెల వెలుగులు పటాలవలె నేలమీద పరుగెత్తుతున్నాయి.

పల్లెటూరి బాటమీద పటం వూరేగిస్తూ పోతున్నారు కుర్రాళ్ళు. మంగమ్మ కిటికీ దగ్గరికి వొచ్చి వెనక్కి చూస్తోంది.

"చూశావా, ఆ మృదువైన ఆ భక్తి ఇంకా పల్లెటూళ్ళని విడువలేదు. ఈ నాగరికత యెక్కువైన కొద్దీ

నిర్లక్ష్యం మెక్కువై 'దేవుడనా, దెయ్యమనా' భయం లేకండా తయారవుతారు," అని వెంకట్రావుగారు అన్నారు.

"అది భక్తిఅంటారా? వాళ్ళది ఉత్త మూఢత్వం" అన్నాడు గోపాలరావు

"రెంటికీ భేద మాట్రేవుందా? ఒకలాగుచూస్తే భక్తి అంతా మూఢత్వమే!"

"ఈయనతో మాటాడకోయ్. పున్నమతి పోతుంది."

అంది మంగమ్మ.

"మీరేమంటారు?" అని అడిగాడు వెంకట్రావుగారిని.

"నే నేమంటేనేం! నువ్వు యోచించు? చదువుకున్న వాడివి. మీరుసొంతంగా యోచించరు. టీచర్లదగ్గిరా పుస్తకాల్లోనూ, చదివిందే నిజమనుకుంటారు. నువ్వేమంటావు?"

గోపాలరావు మాట్లాడలేదు. రవణ నవ్వుతో మొహం తిప్పుకుంది. ఆమె నవ్వునిచూస్తో గోపాలరావు వూరుకున్నాడు.

వెంకట్రావుగారు నవ్వుతున్నారు రైలాగింది, తెల్లని దీపాలు రైలుపక్కన మెరిశాయి. రాత్రామనోహరి వాసన గప్పుమంది.

"గోపాలం, కడుపులో దేవుడు గోలపెడుతున్నాడు. భోజనం తీసుకురావోయ్."

గోపాలం దిగివెడుతో వెనక్కి తిరిగిచూశాడు. రవణ చూపులు తనవెనక వొస్తున్నాయి. హృదయంలో వెలుగు కలిగింది. వెళ్ళివొచ్చాడు.

"ఇంకా రెండు విస్తళ్ళు అడిగి తీసుకురాక పోయి నావా?" అంది మంగమ్మ రైలుపోతూవుండగా.

"ఇవ్వనన్నారు"

"ఏం చేస్తాం ? నువ్వూ నేనూ ఓదాంటో. రరణా గోపాలం ఓదాంటో. వాళ్ళిద్దరికి ఇది మొదటిమాటూ. మనకి ఆఖరిమాటూ...!"

"ఛీ వూరుకోండి."

"అదికాదే. యీ భోజనంతో చస్తానని కాదు. ఎన్నాళ్ళు బతికితే మాత్రం మళ్ళీ యిట్లా ప్రయాణం చేస్తే ఒక విస్తట్లో తింటామా ? అంటున్నాను."

కంటికొలికిలోంచి రవణని చూస్తున్నాడు గోపాల రావు. రవణ తలతిప్పి ట్రంకులవంక చూస్తోంది.

"మొగుడిచేత పనిచేయించుకోడం మొదలా ! రా వొడ్డించరాదూ ?" అంది. మంగమ్మ నవ్వుతో.

సిగ్గుపడుతో రవణ వొడ్డించి నుంచుంది.

"అట్లా కూర్చో దగ్గరగా, ఇంతలో మే మేం అను కోములే."

రవణని ముందు విస్తట్లో చేయిపెట్టేటట్టు చెయ్యడం కష్టమయింది. ఒకొక్కక్క ముద్దని గొంతుకలోంచి దింపడం కష్టసాధ్యమయింది రవణకి.

"సరిగా తింటావా, గోపాలం కలిపి నోట్లో పెట్టాలా?"

రవణ చప్పున తింటోంది. ఇద్దరి చేళ్ళూ విస్తట్లో

కలియబడ్డాయి చక్కలిగింతల తీగెలు బుజాలపైకి పరుగెత్తు తున్నాయి.

రైలు మళ్ళీ ఆగింది.

"గోపాలం, మరచెంబులో మంచినీళ్లు తీసుకురా రాత్రికి వుంటాయి," దిగుతో గోపాలరావు మళ్ళీ రవణవంక చూశాడు.

"రవణమ్మా! అట్లా కూచుంటే విసుగుపుట్టడంలేదూ? నువ్వూ ఒకసారి దిగు! స్టేషన్ చూసిరా" అన్నారు వెంకట్రావుగారు.

గోపాలంఆశతో ఆగాడు ప్లాట్‌ఫారం కంకరవిపరీక్షిస్తూ

అట్లా నుంచున్నావేం ? తీసికెళ్లు."

"రా" అని చెయ్యిజాచాడు.

రవణ బండిదిగి నడిచింది అతనికి అందకుండా. స్టేషన్ దగ్గిరికి వెళ్ళారు. 'వెయిటింగ్‌రూమ్' అనే యింగ్లీషు అక్షరాలు చదవమన్నాడు, చదివింది, ఆమె మాటలు వినబడి తేనే గొప్పగా మధురంగా వుంది. నీళ్ళ కుళాయికేసి తీసి కెళ్ళాడు. నీళ్ళు పడుతో అనుకుంటాడు: ఆ చీకట్లో రవణ బుజంమీద చెయివేస్తే ? తనకి అందకముందే, వుద్దేశ్యం గ్రహించి వెనక్కి జరిగిందా నామర్దాగా వుంటుంది - గాని యిప్పుడు గాకపోతే - ఆమెని చూశాడు. కుచ్చెళ్ళమీద జీరాడుతో - చీకట్లో చెట్టుకింద తెల్లగా ఆపమిట-ఆబుజాలు-

"చెంబు పుచ్చుకో నిండింది."

"గ్లాసు తే ... రైల్లో నా దగ్గిరగా కూచోవేం ? అస హ్యమా. మాట్లాను మరి చెప్పు - ఐతే - నేను వెళ్లి పోతాను." 'ఎక్కడికి వెడతాడు ? పీడి మొహం. అని అను కుంటుందేమో' అని ఆలోచన వొచ్చి ఆగాడు.

"ఇంకమాట్లాడను నీతో - నాకు కోపమొస్తుంది ... మాట్లాడు. అసహ్యమా ? కోపమా!"

"ఛీ, అసహ్య మేమిటి ? కోపమెందుకు!"

పరవశు డైనాడు.

"మరి దగ్గిర కూచుంటేనేం !"

"వాళ్లు లేరూ అక్కడ!"

"వాళ్లు కూచోమంటున్నారుగా !"

"అంటేమాత్రం, సిగ్గుకదూ!"

రైలు కూతేసింది, కదిలింది. గోపాలరావు పెట్టె తలుపు తెరిచి చెంబు లోపలికి నెట్టాడు. గాబరాతో చెంబు దొర్లి నీళ్ళన్నీ వొలికాయి. పెట్టెలోపలికి చూశాడు. రవణకి చెయ్యి అందిచ్చాడు. చెయ్యి పట్టుకొని ఎక్కేసింది రవణ.

"అమ్మయ్యా" తలెత్తి చూశాడు.

"డామిట్ ! హు ఆర్ యూ ?"

ఎవరూ ? ఎవరో తెల్లవాడు ఇదేమిటి ? తెలీక పక్క నున్న ఫస్టుక్లాసులో ఎక్కారు.

గోపాలరావుభయంతో తెల్లబోయిచుట్టూచూశాడు. దొర కోపంతో అతనివంక చూస్తున్నాడు. రవణ యింకా

భయంతో చూస్తోంది అది చేసిన పొరపాటు యింగ్లీషులో చెప్పాడు దొరతో గోపాలరావు.

"ఈ పిల్లను చూడు. బుద్ధిలేదూ !"

"అవును తొందరలో వొలికాయి క్షమించండి"

దొర పక్కన నవ్వాడు.

"పక్క పెట్టెలో వుంది మీరేనా ! ఆ ముసలాయన ఎవరు !"

గోపాలం చెప్పాడు.

"కూచోండి. వొచ్చే స్టేషన్ దాకా ఒకరి కొకరం తప్పం ... ... నువ్వూ కూచో, అమ్మాయీ."

రవణకి ఇంగ్లీషు తెలీదని చెప్పాడు.

"కూచోమను."

"కూచో" సిగ్గుపడ్డది.

"ఎందుకట్లా సిగ్గుపడుతుంది !"

"నా భార్య."

"ఐతే !"

ఏం చెప్పాలో తెలీలేదు.

"అట్లానే సిగ్గుపడతారు."

"ఎందుకు !"

"కొత్త."

దొర అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తున్నాడు.

"కూచోపెట్టు."

చెయ్యి పట్టుకొని కూచోపెట్టబోయినాడు. సిగ్గుపడి విడలించుకుంది.

"ఎంత అందంగా సిగ్గుపడుతోంది ! ఈ దేశస్త్రులకి ఎంత అందమైన కళ్ళు !"

గోపాలరావుకి ముందు తెల్లఆయనమీద కోపం వొచ్చింది. తన పెళ్ళాన్ని మెచ్చుకున్నాడని.

"నేను కూచోపెడతాను చూడు."

ఆమె వేపు నడిచాడు ఆ తెల్లాయన.

పరుపు చివరగా చప్పున కూచుంది. ఆమె పెదిమలు నవ్వుతున్నాయి. గోపాలరావుతో మాటాడుతున్నా, అతని కళ్ళు రవణ మీదనే వున్నాయి. గోపాలరావుకి భయం యెక్కువయింది. వీడురవణని మోహించి నట్లున్నాడే! తనని కిందికి తోసేసి, రవణని యెత్తుకుపోతే ! తోసేస్తాడని నిశ్చయి మేర్పడ్డట్టైజాగ్రత్తగా వున్నాడు. దొర పెట్టె తెరుస్తున్నాడు. రివాల్వర్‌కోసం కాదుకద ! చప్పున వెళ్ళి రవణ పక్కన కూచున్నాడు.

"చూడు, నాకేమన్నా అపాయం కలిగితే —"

రవణ బొమలు ముడిచి వింటోంది. పెట్టెలోంచి ఒక పెద్ద అట్టపెట్టె తీసుకొచ్చి రవణ కియ్యబోయినాడు. తీసుకోదు తలెత్తి చూడదు,

"తీసుకోమను."

"ఏమిటది ?"

"చోకలెట్లు, "

"తీసుకో, చోకలెట్లే. యింకేమీ కాదు."

చెయ్యి కొంచెం జాచి తీసుకుంది చాలాసిగ్గుగా.

"ఇట్లాంటి సిగ్గు నాకు కొత్తగా వుంది. నేనీ దేశంలో దిగి మూడు రోజులు యింకా కాలేదు. ఈ అమ్మాయిని చూస్తే ముచ్చటేస్తోంది. ఆ బట్టకట్టుకోడం చాలా బావుంది. ఎంత నెమ్మదిగా కూచుంటారూ! చక్కగా ఏదో సాధు మృగంమల్లే నడుస్తారు. ఈ యీడువాండ్లు మా పిల్లలైతేనా యీ పాటికి బండిని సగం విరగగొట్టేవారు — "

రయిలాగింది. గోపాలరావు రమణని ముందు తోసుకుంటో తలుపువేపు పరుగెత్తుతున్నాడు.

"గుడ్ బై" గోపాలరావుకి షేకాండుచ్చి రమణవేపు చెయ్యి జాచాడు. రమణ మూలకి వొదిగింది. ఆ దొరతెల్ల బోయి చూసి వూరుకున్నాడు.

౮

వెంకట్రావుగారి బంగళా చాలా పెద్దది. గోపాలరావుకి ప్రత్యేకం ఒకగదివుంది. వెంకన్నపంతులు అభ్యంతరం ఒదిలిపోయిందికదా, రమణ యింక తనతో స్వేచ్ఛగా మాట్లాడుతుందనుకున్నాడు గోపాలరావు. అతని ఆశలన్నీ నిరాశలైనాయి. రమణ ఒక్కసారి మాట్లాడలేదు సరికదా, అసలు కనపట్టంలేదు. అంతపెద్దయిల్లు కావడంచాత తప్పించు

కోడం చాల సులభం. వెంకట్రావుగారు తన వ్యవహారాల గొడవలో వీళ్ళ సంగతి కల్పించుకోవటం లేదు.

వెంకట్రావుగారిని చూడ్డానికి రోజూడాక్టరువొస్తున్నాడు. ఆయన చిన్నప్పుడు రవణనీ, రవణ తండ్రిని ఆవూళ్ళో యెరుగును. డాక్టర్‌గారు చెప్పారని ఆ వూరి హెడ్మాస్టరు రవణని చూడ్డానికి వొచ్చాడు. వీళ్ళందరితోనూ చనువుగా మాట్లాడే రవణ తనతో మాట్లాడక పోవడం అన్యాయంగా కనపడుతోంది గోపాలరావుకి. తన కాలమంతా వంటింటిలోనే గడుపుతోంది. రవణ గదిలో, తను వాకిట్లో కూచోవలసి వొచ్చింది.

రెండు రోజులైనాక ఒకనాటి సాయంకాలం పది పదిహేనుమంది పిల్లలు గుంపుగా వచ్చారు. గోపాలరావుతో రవణ కోసమన్నారు.

"ఏం పని ?"

"పని వుంది."

తనకి తెలీకండా రవణతో ఏం పని ! రవణ మీద నున్న తన స్వాతంత్రం తెలియచెయ్యా లనిపించింది. కాని ఎట్లా చెప్పటం ? కొంచెం సేపుండి వాళ్ళల్లో ఒకడు;

"కొంచెం పిలవండి." అన్నాడు.

"రవణా లేదు గివణాలేదు. పొండిఅనా" లనిపించింది. రవణతో వీళ్ళకేంపని ! కాని ఈ విధంగానన్నా రవణతో మాట్లాడవచ్చు కదా అని లోపలికి వెళ్ళాడు. రవణ స్నానం

తీసి రవిక వేసుకుంటోంది. అతన్నిచూసి ఆ గదిమూలకి ఒక్క పరుగు తీసింది.

"నీకోసం ఎవరోవచ్చారు." అనేసి.

వొచ్చేశాడు. ఎవరన్నా చూస్తారనే భయంతో ...

"చెప్పరా!" అని

అడిగారు వాళ్ళు. ఇప్పుడుకూడా రవణతో సరిగ్గా మాట్లాడ్డానికి వీల్లేకపోయిందికదా అని వాళ్లు మండిపోతోంది అతనికి. అదృష్టంకొద్దీ ఆ సమయాన్నే తను వెళ్ళాలి!

"నాకు తెలీదు పొండి అదిమెవరో !" అని

ముందున్న కుర్రాళ్ళి ఒక్కతోపుతోసి చెట్లకిందికి వెళ్ళి పోయినాడు. అతను కొంచెందూరం వెళ్ళగానే కుర్రాళ్ళందరూ నవ్వారు. వాళ్ళని ఏంచెయ్యాలి అని యోచించాడు. "వెళ్ళి కేడితే ! అందరున్నారే ! బూతులు తిడితే, వెంకట్రావుగారు వింటారు" అనుకుంటో వాళ్ళవేపు చప్పున తిరిగి వొచ్చాడు. వాళ్లు తనవేపే చూట్టంలేదు. అప్పుడే స్నానంచేసి తెల్లచీరె కట్టుకొని, కొత్తగా నుంచుందిరవణ. ఒకడు యిలా చెయ్యి, యింకోడు ఆ చెయ్యి, కట్టుకుని వేళ్ళాడుతున్నారు కుర్రాళ్ళు. పెద్ద గాడిద ఒకడు ఆమె బుజంమీదకూడా చెయ్యేశాడు కలా, నిజమా ? రవణ అమితానందంతో నవ్వుతోంది. పాదాల చప్పుడు చేశాడు. రవణ తలెత్తి చూసింది. సిగ్గుపడి పరుగెత్తుతుందను కున్నాడు. ఏం లేదు. అతను అక్కడ లేనట్టే వాళ్ళతో మాటాడుతోంది. కొంచెంచూసి, తిరిగి వెళ్ళిపోతున్నాడు. ఒకడు —

"రవణా, వాడెవడు మీయింటో!" అన్నాడు.

గోపాలరావుకి రవణ ఏమంటుందో వినాలనివుంది కాని సిగ్గుతో తల తిప్పలేక పోయినాడు.

వాండ్ల సంభాషణ విన్నకొద్దీ బాధ భరించలేకపోయినాడు. వెంకన్న పంతులు యెంత మంచివాడో! ఆయన యింటో తనకియెంత కష్టంగావున్నా, రవణని యే మొగాళ్ళతోనూ, మాట్లాడకుండా కట్టుదిట్టంచేశారు. ఈ వెంకట్రావు గారి యింటో. ఒక్కతోవా, ఒక్కపద్ధతీ లేవు. వెంకన్న పంతులికి యీ సంగతి తెలియజేసి, రవణ యింకా చెడిపోక ముందే, హెచ్చరిక పుట్టించి. యిక్కణ్నుంచి రవణని తీసుకుపోవాలి. ఈ లోపల ? వెంకట్రావుగారితో చెపితే, ఆయన వినిపించుకోరనీ. నవ్వుతారనీ, అతనికి నిశ్చయం. కాని. తిప్పదు. తన మర్యాద పోతేనేంగాక, రవణని, తన భార్యని రక్షించుకోవాలి. ఆలోచించి చీటీ వ్రాసిపెట్టాడు.

"జాగ్రత్త

జాగ్రత్త

రవణ స్కూలుకుర్రాళ్ళతో చాలాచనువుగావుంటోంది."

కింద దస్కతు యేం చెయ్యాలా అని: శ్రేయోభిలాభి, చిత్రగుప్తుడు, మొదలైనవి యోచించి, యేమీ దస్కత్ లేకుండా వెంకట్రావుగారి బల్లమీద పెట్టాడు. వెంకట్రావుగారు యేం మాట్టాడలేదు గాని రవణమొహాం చిన్నపోయింది. భోజనం దగ్గిరికి మొహాం వేళ్ళాడేసుకుని, ధుమధుమ లాడుతో రావటంతోటే, వెంకట్రావుగారూ రవణా ఒకరి మొహాలు ఒకరు చూసుకుని చిరునవ్వు నవ్వుకోడం చూశాడు. కాళ్ళు వాచి

కాయి. తల తిరిగింది. తనకి అర్థంకాని నడిమంత్రపు ప్రపంచంలో పడ్డట్టయింది. బిగ్గరగా యేదో అరవాలనివుంది. విస్తరి చింపి నేలకేసి కొట్టి లేచిపోవాలని వుంది. వీళ్ళందరూ కలసి తనని "ఫూల్" చేస్తున్నారు. ఎట్లా తనాయింట్లో వీళ్ళ మొహాలు చూస్తో తిరగడం ? చెప్పకండా వెళ్ళి పోతే; కాని రవణని వొదిలిపోవాలే ! ఇంకా అ రవణమీద బాధ్యత యేమిటి ? ప్రేమా ? ప్రేమేనేమో !

మళ్ళీ సాయంత్రం కుర్రాళ్ళు రావడం దూరాన్నుంచే చూశాడు. మళ్ళీ నవ్వుతారు. చప్పున కండువా వేసుకుని చిలకలపూడివేపు షికారు బైలుదేరాడు.

ఈ వెంకట్రావుగారు మొన్నటిదాకా అంత దయగా కనపడ్డవాడు ఇప్పుడిట్లా ఐనాడేం ? తనబాధ చూస్తో వూరుకుంటాడేం ? మారింది తనుగాని, ఆయనకాదని తెలుసుకునే స్థితిలో లేడు గోపాలరావు. అంతకన్న వయసూ జ్ఞానమూ కలవాళ్లుకూడా తెలుసుకోలేరు ! తన కెందుకు యీ బాధ ! అందరు భర్తలూ యిల్లాంటి అవస్థ పడతారా? అనుమానంతో స్త్రీ రెండు తంతారు. తను తన్నాలంటే రవణ చిక్కదు. ఇంకా కార్యం కాకపోవడం వచ్చింది ఇబ్బంది. కార్యమే ఐతేనా పగలు ఎక్కడవున్నా రవణని రాత్రి తనగదిలోకి పంపుతారుగదా ? ఆ కుర్రాళ్ళతో మాట్లాడవద్దనీ, వాళ్ళని తిట్టమనీ, తన దగ్గిర్నుంచి కదలవొద్దనీ, ఆజ్ఞాపించ వచ్చు. వెంకట్రావుగారిని అడిగితే! కార్యం చెయ్యమని! ఆ బాధ్యత అంతా వెంకన్న పంతులిది అంటాడేమో !

మళ్ళీ అనుకున్నాడు : ఆ రవణ తనకెందుకు ? ఇంత కోపం వచ్చినా తనకి అనుమానం కలిగినా యెందుకు ఆ రవణని అంతగా కోరడం ? విడిచి యే దేశాంతరమో లేచిపోతే- ఎవరేమనగలరు తనని ? మొగుడు పోయినాడని బాగా ఏడిపిస్తారు రవణని! ఎవరూ ప్రేమించరు. బాగా పనిచేయించుకొని వెళ్ళగొట్టిపారేస్తారు. తన రవణని ఎవరన్నా ప్రేమించి లాలిస్తే ? సుఖపెడితే ! వీల్లేదు. రవణ తనదనే భావం వదలలేదు. ఆమె ఏం చేసినా, యే మైపోయినా; ఆమెబాధ్యత తనదేనని, ఆమెని ప్రేమించడం తన ధర్మమని అతనిమనస్సు అడుగునించి యేదో వినపడుతోంది.

రవణకి అతను బాధపడుతున్నాడనే తెలీదు. బాధ కనపడుతోంది కాని హృదయంలో యెంతటి నరకమో తెలీదు. ఆ బాధంతా తన మీద ప్రేమవల్లనే కదా అని. పైగా ఆనందం. స్త్రీ ఎంత సేపటికీ తన ఆనందాన్ని దూరంగా దాచుకుని, ప్రేమ వుందిగదా అని సంతోషిస్తుంది. పురుషుడు మీద వురకాలనుకుంటాడు. అతని దగ్గిరికి వొచ్చేఆనందాన్ని ఆమె యింకా యెరుగదు. అతను నేర్పిందాకా తెలుసుకోలేదు. ఈ సంగతులేమీ గోపాలరావుకి తెలీవు. కావలసి తనని యేడిపిస్తోందనుకున్నాడు.

కార్యం చెయ్యమని చీటీ వ్రాసి, తన దస్కత్ చేసి వెంకట్రావు గదిలో పెట్టాడు. రాత్రి భోజనం కాగానే వెంకట్రావుగారు గోపాలరావు గదిలోకి వొచ్చికూచున్నారు.

"ఎందుకు తొందరనీకు! కానీ "కోర్సు" పూర్తి అయిందాకా ఆగా లనుకున్నావు కదూ!"

"నా కట్టాంటి తొందరవమీ లేదు. కాని మితిమీరు తోంది. అదుపూ ఆజ్ఞా పెట్టేవాళ్ళు లేక చెడిపోతుంది. ఇంకా వుపేక్ష చేస్తే చాలా ముదురుతుంది"

వెంకట్రావుగారు గోపాలరావు కొత్తధైర్యానికి నవ్వుకున్నారు. ఇన్నిమాట లనడానికి ముందు ఎంతబాధపడి వుండాలో ఆయనికి తెలుస్తోంది. దిక్కులేక యితరుల మీద ఆధారపడివుండి, తనది అనే కానిలేని వారాల కుఱ్ఱవాడు కూడా, తనకి భార్యరాగానే, లోకువ చేసుకుని, బాధ్యతా, యోగ్యతా, మర్యాదా, మాట్లాడుతాడుగదా! ఇరవైయేళ్ళు పెద్దవాడవుతాడు ఒక్కసారిగా, ఒక్కసారి గోపాలరావుతో చాలా మాట్లాడాలనుకుని అనుభవంవల్ల సంపాయించవలసిందేగాని, తన మాటలవల్ల జ్ఞానం కలగదనుకుని వూరుకున్నాడు వెంకట్రావుగారు.

"ఇంతకీ రవణ ఏం చేస్తోంది యిప్పుడు?"

"అదే నేనంటోంది. ఈ ఇంటో మీ కెవరికీ విపరీతంగా కనపడ్డం లేదు."

"మాకు విపరీతంగా కనపడితేమాత్రం, అడ్డుపెడతామనుకున్నావా? నేనూ, నా భార్యా. నీకుగాని, నీ భార్యకుగాని అత్తమామలము కాము. మీ యిద్దరూ మా అతిథులు, స్వతంత్రులు. ఇద్దరికీ యిష్టముంటే యివాళే కలిసివుం

డండీ- మా అభ్యంతరం యేమీ లేదు. నన్నడగడ మెందుకు!"

"కాని అది వొప్పుకోదు. నాతో మాట్లాడదు."

"మరి నే నేం చెయ్యను ! ... చూడు, రవణ చాలా అమూల్యమైనపిల్ల. జీవితమంతా కూడా నీకు నిక్షేపంవంటిది. కాని స్వతంత్రపు టాలోచనలు గలది. ఉపయోగ పరుచుకున్నావా, స్వర్గమనుభవిస్తావు చెరుపుకున్నావా, నీ అంత దౌర్భాగ్యుకుండడు. రవణ ఏమవుతుందో అని నీ కేమీ భయం వొద్దు. అవసరం యేమీ లేదు. దాన్నిబంధించావా, చస్తుంది, ఎగిరిపోతుందో, జాగ్రత్త!" అని లేచి వెళ్ళి పోయినాడు.

మర్నాడు మధ్యాహ్నం రవణ స్నానంచేసి యింటోకి వొచ్చేప్పుడు దోవకాశాడు. చివరలనించి నీళ్ళ బొట్లు పడుతున్న జుట్టుతో, చీరెమాత్రం చుట్టబెట్టుకున్న తడి వొంటితో వెళుతోంది. చుట్టూ యెవరూ లేరు. ఆమె చెయ్యి పట్టుకున్నాడు అకస్మికంగా. దడిసి, అరవబోయి, అతన్ని చూసి, ఆగి, చెయ్యి లాక్కుంది. చెయ్యి వదలక.

"ఒక్కమాట విను ... లాభంలేదు. వొదలను,ఆగు, నీతో మాట్లాడాలి. మాట్లాడి తీరాలి. ఈవాళ సాయంత్రం చిలకలపూడి రోడ్డుమీద అట్లా-రా. నేను అడివిదగ్గిర కలుసుకుంటాను. తప్పకుండా రావాలి, ఏం ? "

రవణ మాట్లాడలేదు. ఆ మధ్యాన్నపు మెత్తని కాంతిలో, ఒకచేత్తో అస్పృశ్యమైన తన లేత రొమ్ము మీదికి

చీర పట్టుకుని. యింకో చేతిని అతను ఖైదుచేస్తే, సిగ్గుతో భయంతో యిటూ అటూ బెదిరి బెదిరిచూసే, రవణ అం దాన్ని అతను చూడనేలేదు. ఇతర స్త్రీలను యెరక్కపోవడం చేత, తనమీద యిష్టమే లేనిదైతే, రవణ యెట్లాప్రవర్తించి వుండేదో, అతనికి తెలీలేదు.

"చెప్పరావాలి నువ్వు."

"వొదలండి."

"వొస్తానను, వొదులుతా."

'పియర్సు' సబ్బువాసనవేసింది అతనికి. నున్నని చర్మం మీది నీళ్ళ బొట్లుమీద ఎండపడి మెరుస్తున్నాయి. రెండు జుట్టుపాయలు వస్త్రంలేని బుజంమీద తడిగా జీరాడు తున్నాయి.

"ఎక్కడికి ?"

"చెప్పేగా ? చిలకల ..."

"ఎందుకు ?"

"మాట్లాడాలి."

"ఎవరో వొస్తున్నారు వొదలండి."

ఆ కంఠంలోని మాధుర్యం, మార్దవం అతనికప్పుడు గోచరించడంలేదు. కాని మనసు అడుగున వుండిపోయి, రెండురోజులు అతనికి అర్థంగాని ప్రేమబాధని కలిగించాయి.

చెయ్యిలాక్కుని వెళ్ళిపోతోంది. చప్పున మళ్ళీ అందు కున్నాడు. జుట్టులో ఒకపాయా, పరంచీర చెరగూ చేతికి

దొరికాయి. తల దూరంగా లాక్కుంది. తడిజుట్టు జారి పోయింది. చీర చెరుగు వొంటి మీదనుంచి అతని వేపు వొచ్చేసింది. అతనికి మొదటసారి కనపడ్డ ఆమె శరీరాన్ని చూచి సిగ్గుపడి చెరుగు వొదిలేశాడు. రవణ వెళ్ళిపోయింది.

సాయంత్రం దోవలో తూముమీది వొంతెన మీద కూచున్నాడు. రవణ వొస్తుందన్న ఆశ పూర్తిగా వుంది. తను అంత గట్టిగా చెప్పింతరువాత నిర్లక్ష్యంచేస్తుందా? వొంటరిగా ఆడది కొత్తవూళ్లో ధైర్యంచేసి యెట్లా రాగలదనే సందేహం అతనికి రాలేదు. నాలుగైదు సార్లు రవణ కోసం గోడ్డువెతికాడు. అతనిముందు చెవులూ, తోకలూ ఆడిస్తో, గడ్డి మేస్తున్నాయి ఆవులు. ఎవరో ఒకామా, ఒకాయనా, సైకిళ్లమీద వెడుతున్నారు. అతనికి యీర్ష్య కలిగింది. వాళ్లకి కొత్తగా పెళ్లి అయింది. ఎంత స్వేచ్ఛగా నవ్వుకుంటున్నారూ! ఊరపిచ్చుకలగుంపు కదలకుండా కూచున్న అతని కాళ్ల ముందు వాలి, రివ్వున యెగిరి పోయింది.

చీకటి పడుతోంది. క్రమంగా చెట్లూ, రోడ్డూమాయ మవుతున్నాయి అతని దృష్టినించి. నిరాశా, రోషమూ, దుఃఖమూ కమ్ముకున్నాయి అతని మనసుమీద. చీకటిపడ్డ తరువాత బైలుదేరుతుందేమో! 'నిజంగానే వొకసారివస్తే. ఇంత యేడిపించి నందుకు రెండు చెంపలూ గట్టిగా వాయించి' ... పాపం యేడుస్తుంది. అప్పుడు దగ్గిరికిలాక్కుని గట్టిగా చేర్చుకుని, అన్ని అపరాధాలూ మరచిపోవచ్చు. రాకూడదూ? రాదు. మళ్లీ కోపంవచ్చింది. ఎందుకు తన

సిట్లా బాధ పెట్టాలి. తనభార్య ! కానీ, కానీ, యెన్నటికన్నా తన యింటికి రాకపోదుకద ! తన అధికారం లోంచి తప్పించుకోలేదుకద ! అప్పుడూ - యీ కసి అంతా తీర్చుకోవాలి. ఏడ్చి పాదాలమీద పడి వేడుకున్నా క్షమించకూడదు.

అతను లేచేటప్పటికి, చంద్రుడు తాటిచెట్ల వెనకనించి సముద్రంలోంచిమళ్లీ పచ్చగా వుదయించి గోపాలరావు కాళ్లదగ్గిర వున్న నీళ్లలో పక్కన నవ్వాడు. అంతా నిశ్శబ్దం. ఎక్కడ వున్నానని చుట్టూ చూశాడు చుట్టూ యిసిక మైదానం - వొంటరిగా తను - వెనక అడవి. అతని హృదయంలో పెద్ద శాంతి వొచ్చింది.

ఇంటికి వెళ్ళేటప్పటికి తన శాంతి అంతా అబద్ధమని తోచింది. తానిందాకటి నించి పొందిన వైరాగ్యం కల -తన భార్యా, ఆమె నిర్లక్ష్యమూ, తన అసహాయత్వమూ, అవే సత్యం - స్థిరమైనవి. గుండెలలో బరువుతోచింది ఈలోకం లోకి, ఈ కష్టాలలోకి మళ్ళీ యెందుకు వొచ్చానా, ఆభావ ప్రపంచంలోంచి అనిపించింది భోజనం చెయ్యాలని లేదు. కాని వంటావిడ కాచుకుని కూచుంది. వెంకట్రావుగారు గదిలో కూచుని వున్నారు. తనమీది ఆదుర్దావల్లనే నేమో! భోజనానికి రమ్మంది ఆవిడ. రానంటే ప్రశ్నలు. ఏవో అబద్ధాలు, ఇవన్నీ నిగ్రహించలేదు భోజనంచేసే బాధే నయం.

ఏం తింటున్నాడో తెలీకుండా తిని, చెయ్యికడుక్కొని పైటపడ్డాడు. అంతసేపూ రవణ యేమయిందా. తను అన్నా

నికి రాలేదనే ఆదుర్దాకూడా లేదుకదా ఆమెకి - అని జిజ్ఞాస పడుతోనే వున్నాడు. చెయ్యి తుడుచుకుంటో హాల్లోపలికి వొచ్చేటప్పటికి ఆ మూల మంచంమీద పడుకున్న రవణ కనపడ్డది. దగ్గరలో ఎవరూ లేరు, చప్పున పక్క దగ్గరికి నడి చాడు,

"ఒకసారి బైటికిరా, మాట్లాడాలి"

రవణ మాట్లాడలేదు. నిద్రా ! కాదు. తప్పక దొంగ వేషమే ! అబద్ధపు సిగ్గు, వొంగి నడుంమీద చెయ్యేసి కోపంతో కదిలించాడు. అతనిమనసంతా కోపంమీదనేవుంది. కాని చేతివేళ్ళ చివరలనుంచి, ఆనందతంతులు చలిస్తున్నాయి. హృదయంలోని కోపం అటూ ఇటూ చెదిరి, పొంగి పాల మీది మీగడవలె పక్కలకు వొదుగుతోంది. కోపంతో మండే కళ్ళతోనే, దగ్గరగా కలుసుకున్న ఆమె పెదిమలూ, చంపల మీద పడుకున్న కనురెప్పల చివర్లూ, చూస్తున్నాడు. కాని కోపాన్ని అతను వొదలతలుచుకోలేదు. ఆమె బుజాన్ని గట్టిగా పట్టుకొని సౌఖ్యపడుతో వూయించి — గట్టిగా గొం తుక శబ్దం కాకుండా.

"వొస్తావా, రావా ! రావూ! పెంకితనం వొదులుస్తా వుండు."

కదల్లేదు. వేళ్ళు గట్టిగా బిగించాడు ఇంకా గట్టిగా... అబ్బా, యెంతబాధ ఓర్చుకో గలదు ? గోళ్లు గుచ్చాడు. నిద్రలోవలె పక్కకి తిరిగింది, చేయిని తప్పించుకొని. స్త్రీవిష యంలో పురుషుడికి అధికమైన ప్రేమ, ద్వేషంగా మారడం

చాలాసులభం. కోపమూ, భగ్నమయ్యే ప్రేమా, అతన్ని పశువుని చేస్తున్నాయి.

వంటావిడా, వెంకట్రావుగారూ తెలుసుకుంటారనే పిరికి తనమూ, తన అసహాయత్వానికి కారణమైన దుర్బలత్వమూ, అతన్నంత క్రూరుణ్ని చేశాయి. ఆమె జడలో యిమడక చెంపలమీద జీరాడే జుట్టుని, దేని మెలికలుజూచి కవులు పరవశమౌతారో, ఆ జుట్టుని పట్టుకుని గట్టిగాలాగాడు. సిగ్గూ, భయమూ, జాలీ, అన్నీపోయినాయి. గట్టిగా యింకా గట్టిగా లాగాడు. దిండుమీద నుంచి తల పైకిలేచింది. బాధతో ముహం ముడుచుకుంది. ఇంకా అరవదేం ? ఇంకా బతిమాలుకోదేం ? ఇంకా ఓడిపోదేం ! క్రౌర్యం హెచ్చుతోంది. బాధ పెట్టాలి — నరకాలి. చంపాలి అర్థంకాని ప్రోత్సాహాలు సముద్రతరంగాలవలె హృదయంలో పొంగిపోతున్నాయి. అదంతా ప్రేమంటే నమ్మడు.

చేత్తో జుట్టుపట్టుకుంది.

"అబ్బా" అంది జాలిగా, ఉత్సాహం తక్కువయింది అతనికి, రెండోవేపు జుట్టుపట్టుకుని లాగాడు. వేడిగా శ్వాస వొస్తోంది. బాధకు లోబడి, చెయ్యి వొదిలేసి కూచుంది, ఏమనదు, జుట్టు వూడిపోతుందేమో ననిపించింది.

"కోపం" వచ్చింది, తల తిరిగింది. ఇంకేం చేస్తాడు ? తలపట్టుకుని విసిరి వెనక్కి కొట్టాడు. గోడకుతగిలి "దబ్" మని శబ్దమయింది. ఇల్లంతా మేలుకొని చూస్తున్నదని పించింది. ఒక్క నిమిషం యిటూ అటూ చూశాడు. చప్పున

కూలబడి యేడ్చాడు. ఎండాకాలంలో వురిమి వురిమి, చప్పున నిశ్శబ్దమై చల్లని గాలివేసి. వర్షించి నట్టయింది. గుండ్రని చేతులు తలకింద పెట్టుకుని గుడ్లువిప్పి రెండునిమిషాలు రవణ అతనికేసి చూచింది. అతను యేడుస్తోంటే తను పడుకున్నందుకు సిగ్గుపడి చప్పునలేచి, ముందుకొచ్చింది. వెళ్ళిపోతోందనుకుని, గోపాలరావు చెయ్యి పట్టుకుని కూచోపెట్టాడు. సిగ్గుపడుతో చెరుగుతో అతని కళ్లు తుడిచి. సిగ్గెక్కువై కళ్ళు వాల్చి, వూరుకుంది. గోపాలరావు దగ్గిరికి జరిగాడు. ఆమె చేతులు అతని మెడచుట్టూ కలిపింది. గోపాలరావు కన్నీళ్ళు ఆమె వొళ్ళో పోగుపడుతున్నాయి. ప్రతి వేడిచుక్క ఆమె తొడల్ని వొణికించింది. ఆమె మాట్లాడాలని వుంది. సిగ్గు కంఠం నొక్కుతోంది. సిగ్గుతో పోట్లాడి జయించింది.

"ఎందుకు ఏడుస్తారు?"

కంఠం సంతోషాన్ని సూచిస్తోంది. తనకోసం యేడుస్తున్నాడు భర్త! తను – తనబాధ కారణం.

"నిన్ను బాధించాను."

నవ్వు వొచ్చింది, తనవొళ్ళో యేడుస్తున్న ఆ పెద్ద పాపని చూసి.

"మరి ఎందుకు అట్లా చేశారు?"

"మరి ఎందుకు రాలేదు నువ్వు?"

"ఎందుకురాలేదో రవణకి తెలీదు. ఎందుకంత వుగ్రుడైనాడో అతనికే తెలీదు. ఆమె పెంకితనమూ అతనికోపమూ

రెండూ పురాతనం నుంచివొచ్చే "ఇన్‌స్టింక్ట్సు" అవి తెలిస్తే మాత్రం ఏం ప్రయోజనం! తెలిసిన వాళ్ళందరూ తప్పించుకో గలుగుతున్నారా!

"అందరూ యేమంటారు!"

"ఎవరేమంటే మనకేం!"

రవణకంటే తానెక్కువగా యితరుల అభిప్రాయాలకు జంకుతానని అతనికి తెలీదు తెలుసుకో లేదు.

ఎందుకు నమ్మ రమ్మన్నారో చెప్పనే లేదు."

"ఇక్కడా! బైటికిరా."

"బైటికా! ఎందుకు! ఇక్కడ చెప్పండి."

ఏమన్నా వుంటే అక్కడే చెప్పను. రవణ రావాలి.

"ఇక్కడ కాదు. రా"

"ఈవాళ కాదు. రేపు."

ఎంత బతిమాలినా రాలేదు, వంటావిడ వొస్తున్న చప్పుడయిందాకా తగాదా జరుగుతూనే వుంది.

రాత్రంతా వొంటరిగా పక్కమీద పడుకుని యోచించుకున్నాడు రవణ యెందుకురాదా! అని. అంత మాత్రం పెంకితనం లేక భర్తకి జడిసి ఎట్లా చెబితే అట్లా వినే భార్య వుత్త అవివేకి అనీ, అటువంటి నిస్సత్తువ మనిషిమీద భర్తకి త్వరలో విసుకు వస్తుందనీ తెలుసుకో గలడా! ఎన్నేళ్ళకో గాని రాదు ఆ జ్ఞానం, ఎంతో అనుభవంమీదగాని;

అప్పుడు అజ్ఞానం అనవసరం. "టూ లేట్." ఈలోపల ఎన్ని తప్పులో. ఎంత విచారమో. ఎంత "వేస్టు!" అనుభవం కలవాళ్ళు చెప్పరు, చెప్పినా తెలుసుకునే స్థితిలో వుండరు. చిన్నవాళ్ళు.

రవణకి యీ పెంకితనమంతా కూడా అతనికి చవకగా లోబడకూడదని! అతని హృదయాన్ని కట్టివెయ్యాలని, తన వ్యక్తిత్వం నిలుపుకోవాలని, తన చాతుర్యం, స్వంతబుద్ధి నశిస్తే. తనే నశిస్తుంది. అజ్ఞానం "యిన్‌స్టింక్టు" రూపాన సృష్టేయిస్తోంది. ఆమెకా! ఆలోచనలులేవు. కాని గుడ్డిగా సృష్టి ఆజ్ఞలకు, తన స్వరక్షణోపాయాలకు లోబడి ప్రవర్తిస్తోంది. మూర్ఖులైనవారు అధికారంచూపి, నలిపి, చంపి, శవాల్నిచేసి, స్త్రీలను అవతల పారేస్తారు. యింతమాత్రం తెలీక వాళ్ళు తమ ఆజ్ఞలకు తిరగబడుతున్నారని అనుకుంటారు.

## ౯

అరవింద రాగానే గోపాలరావుకి కొత్త సమస్యలు పట్టుకున్నాయి. రవణకోసం వచ్చే కుర్రాళ్ళను తప్పించాలని ప్రయత్నించాడు. రవణతో రాత్రులు మాట్లాడ్డం సులభమయింది ఒకరాత్రి నవ్వుతో మాట్లాడుతుంది, మళ్ళీ కొన్ని రాత్రులు కనబడదు-ఒక్కమాట నోచ్చుకునేట్టు అన్నాడా, మూడురోజులు అసలు కనబడదు. ఈచర్యలన్నీ అరితేరిన

కులటలు చేసేపనులని పుస్తకాల్లో చదివాడు. కాని ఆరితేరిన కులటలు కావలసి జ్ఞానంతో చేసేపనులే, ఏమీ తెలియని అమాయకురాలైన రవణ సృష్టిశక్తి చేత ఉద్భోదితురాలై చేస్తోంది.

"సాయింత్రం వొస్తారే కుర్రాళ్లువాళ్ళతో మరీ చనువుగా వుంటునాన్నవు"

రవణ మాట్లాడక వూరుకోని—

"అదేనా యేమిటి, మీకోపానికి కారణం"

"మరి నువ్వుఅంత అన్యాయంగా ప్రవర్తిస్తూవుంటే."

రవణ నవ్వింది,

"మీకు పిచ్చి" అంది.

ఎంతో అనుభవమున్నట్టు తనని అదమాయించడమేమిటి ? ఇదో వేషం!

"వీల్లేదు. నువ్వు వాళ్ళతో—"

రవణ నవ్వుతో—

"ఛా, వూరుకోండి వాళ్లెవరు, నేనెవరు!"

గోపాలరావు 'సీరియస్‌గా' మాట్లాడుతున్నాడని అనుకోదు రవణ. వాళ్ళకీ తనకీ సంబంధం కట్టడమంత దూరం పోదు ఆమె నిర్మలమైన మనసు. ఆటలాగుంది. తనని వుడికించడానికి అంటున్నాడనుకుంటుంది.

"కాని, చూసేవాళ్ళకి—"

ఇట్లానే అనుమాన మలినంతో నిర్మలమైన మను షుల్ని దుర్మార్గంలోకి పరిచయం చెయ్యడం—

"మాట్లాడకండి—పాపం, నన్నువిడవలే—నాన్న గారున్నప్పుడు ఎంత ఆనందంగా వుండేది! ఎన్ని ఆటలాడు కునేవాళ్ళం!"

"ఇప్పుడు బావుండలేదా!"

"ఆ రోజులు వేరు."

గోపాలరావు మనసు శాంతించలేదు. పగలంతా యోచించాడు. రాత్రి ఎన్నివిధాల ఆజ్ఞాపించినా వినదు. నవ్వుతుంది, వెక్కిరిస్తుంది. ఇంకేమో మాట్లాడుతుంది. కారణా లడుగుతుంది.

"వాళ్ళను పొమ్మను—రానీయకు"

"రాగానే, పొండి అంటాను."

"అంటావా!"

వాళ్ళు పోకపోతే నాకు తెలీదు."

"ఎందుకు పోరేం!"

"నేను పొమ్మంటానని అనుకోరు,"

"నేను గెంటుతాను."

'ఒకణ్ణి గెంటితే, మిగిలినవాళ్ళు వొస్తారు,"

"అబ్బా! నీ నవ్వటం ఆపు"

ఇంతే, దొరకదు. వొప్పుకోదు. ఇప్పుడే తనమాట వినకపోతే, ముందు వింటుందా! వొప్పించితీరాలి.

మర్నాడు—

"వాళ్ళని పంపవన్నమాట. ఐతే నేను వెళ్ళిపోతాను."

"ఎక్కడికి?"

"ఎక్కడికో."

*    *    *

రవణ పట్టుచూసి అతనికి అనుమానం ఎక్కువయింది. వాళ్ళు తనకంటే ఎక్కువా?

పరిస్థితులు యిట్లావుండగా అరవిందవచ్చింది. అరవింద వెంకట్రావుగారి కూతురు. ఇన్నాళ్ళు మదనపల్లిలో చదువుకుంటోంది. ఆమెకి పెళ్లికాలేదు. ఆమె గదితలుపు తీసుకు బైటికివొస్తే, రవివర్మ పటంలోంచి బొమ్మనడచి ముందరికి వొచ్చినట్టుంటుంది—ఆ పెద్దజుట్టూ, పెద్దకళ్లూ—శరీరమూ—కాని బొమ్మలకన్న సన్నం—అంతే—

ఆమె తనని పలకరిస్తుందేమోనని గోపాలరావు భయం—పలకరించలేదు. పలకరించలేదని కోపం. వెంకట్రావు గారు అతన్ని ఆమెతో పరిచయం చేసినప్పుడు, కళ్ళెత్తిచూసి, ఇంకేదో సంగతి మాట్లాడింది. అన్నిటికన్నా కోపం— రవణ అసలు కనపడ్డం మానేసింది. ఎప్పుడూ ఆమెతోనే,—

అరవిందని చూడగానే చాలాగౌరవం కలిగింది గోపాలరావుకి. చాలామందికి అంతే—తమస్త్రీలు చదువుకోడం, స్వేచ్ఛగావుండడం యిష్టముండదు. మళ్ళీ చదువుకున్న స్త్రీలను చూస్తే చాలాగౌరవం. కానితమకు గౌరవమున్నట్లు

యితరులకు తెలీడం యిష్టముండదు. కనక 'స్కాండల్స్సు'
మాట్లాడతారు. వాళ్ళనిగురించి హేళనచేస్తారు.

గోపాలరావుతో ఆమెమాట్లాడక పోయేటప్పటికి—ఆమెకి తన మీద తృణీకార మనుకున్నాడు. తనని ఎవరన్నా గౌరవిస్తే ఆశ్చర్యం, తృణీకరిస్తే సహజంగానే వుంటుంది. కాని కోపంమాత్రం వుండకపోదు, అందులో తనభార్యతో స్నేహముచేసి, తనను నీచంగాచూస్తే భరించలేడు. ఆమెలో లోపాలు వెతకటం ప్రారంభించాడు. ఎందుకు పెళ్ళిచేసుకో లేదు? ఎందుకంతగర్వం? ఎందుకంతపోరు ఆ ఠీవియేమిటి? వుత్త అందమూ పై తెలివితేటలే కాని, అసలు తెలివి వున్నట్లు తోచదు. 'మొగాళ్ళతో మాట్లాడితే తప్పా! మరి యిదేం స్వాతంత్రం! ఇదేంచదువు? కాని డాక్టరుతో అంత చనువుగా మాట్లాడిందే! చదువువల్ల ప్రయోజనంయిదా? ప్రతి మొగాడితోను చనువుగా మాట్లాడ్డమా! అధికారవంతుడితో సరసాలు - బీదవాణ్ణిచూస్తే అసహ్యం- ఇట్లాంటిస్త్రీలవల్లనే దేశమిట్లా పాడైపోతోంది. ఈ సంగతి పేపర్లకి ఒక వ్యాసం వ్రాయాలి. పేరుపెట్టా? పేరు లేకుండానా?'

అరవింద ఆవూరి ఛైర్మనుగారిని యెరుగును. ఆయన్నడిగి. ఒక మోటారుకారు తెప్పించింది. రెండురోజులు ఆమే, రవణా షికారు వెళ్ళారు. తనతో మాట్లాడనన్నా మాట్లాడని ఆ మనిషితో రవణకి స్నేహ మేమిటి? ఐనా ఆమె "కారెక్టర్" మంచిదై వుండదు. రవణని చెడగొడుతుంది. ఎవరితో చెప్పుకుంటాడు? తన పెళ్ళాన్ని మందలించుకునే శక్తి

తనకి లేకుండా ఐపోయింది. సాయంత్రాలు ఎక్కడికి పోతు న్నారో, యేమో! డ్రైవర్లతో చాలామంది గొప్ప స్త్రీలకి సంబంధాలున్నాయని విన్నాడు. తనకే అధికారంవుంటే రవణని వెళ్ళవొద్దనేవాడు. అప్పుడేం చేస్తుంది అరవింద, తనతో మాట్లాడక, తనముందు ప్రాధేయపడక? ఆమే, రవణా తననిగురించి వెక్కిరించుకుంటో ఉంటారు, తనమీద అసహ్యం పుట్టిస్తోంది. ఈ అడయారు మనుష్యుల ప్రవర్తనను గురించి ప్రపంచం అనేకవిధాల మాటాడుతోంది.

మూడోరోజు వెంకట్రావుగారుకూడా బైలుదేరారు. గోపాలరావు వరండాలోనుంచున్నాడు. ఆయనేదో అన్నారు. అరవింద కారు దిగివచ్చి

"మీరూ వొస్తారా?"

ఇదివరకంతా పిలిచినా వెళ్ళకూడదు, పిలిస్తే—

"నే నెవర్నిలెండి!" అందామనుకున్నాడు. ఇప్పుడు మాట్లాడలేదు.

"పని వుందా?"

"ఏమీలేదు, చోటుందా?" అన్నాడు.

వెంకట్రావుగారు క్లబ్బుదగ్గిర దిగిపోయినారు—తను ముందు కూచున్నాడు. వాళ్ళిద్దరూ వెనక కూచున్నారు, ఆను మాటలుచూస్తె ఆమెకేమీ గర్వం లేనట్టు తెలుస్తోంది. కాని అతను ఆ సంగతి వొప్పుకో తలుచుకోలేదు. అతనితో మాట్లాడి, యితరుల్ని తృణీకరిస్తే, ఆమెకేమీ గర్వంలేదుఅనుకుంటాడు.

అప్పుడప్పుడు అతన్నికూడా పలకరిస్తోంది. అతన్ని పిలవాల్సి వొస్తె, బుజంమీద చెయ్యేసి, లాగి పలకరిస్తుంది. అతనివొళ్లు ఎట్లా అయిందని! జల్లుమని నరాలు వొణికి, నోట మాటరాదు, ఎంత అమాయకురాలో, అనుకున్నాడు.

మోటారుదిగి ముగ్గురూ కాలవవొడ్డున నడిచారు. అరవిందకి తాను ఆడదాన్ననే జ్ఞానమే లేనట్టుతోచింది. రవణ తానక్కడ లేనట్టే ఉత్సాహంగా స్వేచ్ఛగా మాట్లా డుతోంది. అది అతని కిష్టంలేదు. ఈ అరవింద "ఇన్ఫ్లు యన్సు." రవణకూడా తన కట్టూ జుట్టూ మారుస్తోంది. కాని ఇది వరకంటే అందంగా వున్నదని వొప్పుకోడం యిష్టం లేదు.

"ఈ పేటలో మేము నాలుగేళ్లు కాపరం వున్నాము. ఇది దాటితే శివగంగ. అక్కడ తోటవుంది—ఆ మూల— ఎప్పుడన్నా వెడదాం దాంట్లో చిన్నకోనేరు. ఆదివారము మధ్యాన్నం నాన్నా నేనూ వెళ్ళేవాళ్ళం. చాలాసార్లు ఆయన కంటతడి పెట్టుకునేవారు. ఎందుకంటే— 'నీకు చెప్పినా తెలీదమ్మా, అప్పుడే. అనేవారు. ఇట్లా నన్ను వొదిలెయ్యాలని తనకి తెలుసేమో అనుకుంటాను." అంటోంది రవణ.

కాలవ యెండిపోయింది. కాని కొత్తవానలకి గడ్డి పచ్చగావుంది. దానిమీద కూచున్నారు. ఎండాకాలపు గాలి వీస్తూనేవుంది.

"లోకంలోకల్లా నాకు యిదే అందమైన వూరు" అంది రవణ.

"విూకూనా?" అంది అరవింద.

"నాకెందుకుంటుంది? ఆఅందమేదో యీవూరివాళ్ళకే తెలియాలి!"

"నాకు ఏమీ అందం కనపడదు."

"ఈవూళ్ళో నాలుగైదేళ్ళుంటే తెలుస్తుంది!"

"అంతకాలం ఉండలేనబ్బా."

"నాకీ నాలుగు రోజులే ఏమీతోచడంలేదు. నువ్వు లేకపోతే యింక అసలే తోచేదికాదు."

"నాలుగైదేళ్ళు వుంటే, యమలోకం విూదకూడా యిష్టం కలుగుతుంది." అన్నాడు గోపాలరావు అరవిందతో

"అంతేనా, రవణా!"

"కళ్ళులేకపోతే మన మేం చేస్తాం?"

"మనుషులు బావుంటే వూరు బావుంటుంది." అన్నాడు అతను వుండివుండి.

"ఏ మనుషులు?"

"మన చుట్టూ వున్నవాళ్ళు."

"బావుండడమంటే—"

"సవ్యంతో, సఖ్యంగా—"

"అంటే, రవణ అట్లావుండటం లేదంటారా?"

"నేననందే?"

"ఏం, రవణా!"

"ఎట్లా అనుకుంటే అట్లాను."

"మధ్య నేనేమిటి! ఇద్దరూ మాట్లాడుకోండి," అని లేచి వెళ్ళింది. కాని ఆమె అరగంటకి తిరిగి వొస్తె, ఆలోపున యిద్దరూ ఒక్క మాటా మాట్లాడుకోలేదు.

ప్రతిరోజు సాయంత్రం షికార్లు వెడుతున్నారు. అత వింద మాటలూ ప్రవర్తనా గోపాలరావుకి చాలా సరదాగా వున్నాయి. ఆమె అభిప్రాయాలూ తెలుసుకోవాలనివుంది. చాలా వివాదాలు జరిగాయి, ఆ మాటల్లో యిద్దరూ రవ ణని మరచిపొయ్యేవాళ్ళు.

"మీరు పెళ్ళిచేసుకోరా?"

"ఏమో ఏంచెప్పను! కాని చేసుకునే రకం మనిషిని కాను."

"రకమేమిటి"

"అంటే—యిల్లూ, బిడ్డలూ యిష్టంవున్న వాళ్లకి పెళ్లి. నాకులేదు."

దానిమీద చాలా ప్రశ్నలు తోచాయి అతనికి. కాని ఏమను కుంటుందో అని వూరుకున్నాడు.

"మరి ఏం చేస్తారు?"

"అందరూ ఏం చేస్తున్నారు?"

"సంసారమూ, పిల్లల్ని పెంచటమూ"

"అవి చెయ్యకపోతేనేం?"

"మరి లోకమెట్లా?"

"లోకం లేకపోతేనేం?"

"మనందరమూ?"

"లేకపోతేనేం?"

"దేవుడున్నాడా?"

"వుంటే?"

"లోకం వుండదూ?"

"వుంటే లోకం సంగతి ఆయన చూసుకుంటాడు."

"మనచేత లోకాన్ని నడుపుతాడు."

"నా చేత నడపనీను."

"మీ యిష్టమూ?"

"నా యిష్టం కాకపోతే, ఇంత వాదన యెందుకు? ఆయనే చేస్తాడు నాకు పెళ్ళి." నవ్వింది.

"వూరికే నాతో వాదిస్తున్నారు. ఏదో వుద్దేశ్యం వుంది మీకు."

మాట్లాడలేదు.

"మీ కోసం, మీరు బతకడం చాలా స్వార్థం"

"పెళ్ళానికీ పిల్లలకీ పెట్టడం చాలా ఉదారత్వం. అవునా?"

"మరి వాళ్ళని ప్రేమించినా?"

"నేనూ ప్రేమిస్తాను."

"ఎవర్ని?"

"నా యిష్టం వొచ్చిన వాళ్ళని-?"

"అప్పుడు పెళ్ళి చేసుకుంటారా?"

"ఏమో!"

"మీకు మతమే లేదన్నమాట?"

"మీకు వుందా?"

"ఆ"

"అంతమాత్రం నాకూవుంది."

"మరి దేవుడే లేడంటారు."

"మీ మతానికీ, నా మతానికీ అదే భేదం. మీరు చూడని దేవుణ్ణి మీరు ఉన్నాడంటారు. నేను చూడని దేవుడి సంగతి నేను తెలీదంటాను"

"ఐతే లోకం ఎట్లా వొచ్చింది?"

"నాకు తెలీదయ్యా అనలేమా? మీకు తెలుసా?"

"ఆ — దేవుడు చేశాడు."

"దేంతో? చేశానని చెప్పాడా?"

"మరి ఎవరు చేశారు?"

"నాకు తెలీదయ్యా. నేను తెలుసు ననలేదు. మీరే చెప్పాలి."

గోపాలరావుకి చాలా కోపం వస్తోంది. కాని ఆమెనీ, ఆమె స్వేచ్ఛనీ, నిర్లక్ష్యాన్నీ చూస్తే అతనికి సరదాగావుంది. రవణ ఎంతవరకు ఆమెని అనుకరిస్తుందో అనే భయం ఒకటే అతన్ని కలవర పెట్టింది.

వొచ్చినప్పణ్ణించి అరవింద యింటో ప్రాముఖ్యత వహించింది. ఆమె యెట్లాచెపితే అట్లా వింటారు వెంకట్రావుగారు. ఆమెనిచూస్తే అమిత మైన నమ్మకం. వంటదగ్గిర్నించి కోర్టు వ్యవహారంవరకు ఆమెదే పెత్తనం. గోపాల్రావునీ, రవణనీ మాట్లాడించాలని ఆమె చాలా ప్రయత్నాలు చేసింది. వొంటరిగా మాట్లాడుకోరు గాని ఇతరులు వున్నప్పుడు స్నేహితులవలె పలకరించుకుంటారు. ఎప్పుడీ శెలవలై పోతాయా, ఎప్పుడు వెళ్ళి పోతామా అనుకుంటున్నాడు.

ఓరోజు పొద్దున్న అరవిందకి టెలిగ్రాం వొచ్చింది. అప్పణ్ణించి ఆమె చాలా అడావిడిగావుంది. ఏవో సద్దుతోంది, బజారునించి తెప్పిస్తోంది. మధ్యాహ్నం అతని గదిలోకి వొచ్చింది. మొహాన కొత్త కాంతితో జుట్టులో పువ్వులతో చాలా ఆకర్షకంగా కనపడ్డది

"మిమ్మల్ని ఒక ప్రార్థన చెయ్యాలని వొచ్చాను. మీరేమంటారో"

"అంత అడగాలా?"

'నాలుగురోజులు యీ గది కావాలి నా స్నేహితులు వొస్తున్నారు. అయన చాలా మహిమకలవాడు.

"సరే, అందుకేం?"

"'థాంక్సు' మీసామాను హాలులో పెట్టిస్తాను."

హాలులో రవణ వుంటుంది. ఇంకేం?

# ౧౦

అరవిందచేసే ప్రయత్నాలు చూస్తే ఆ అతిథి చాలా గొప్పవాడై వుండాలి ఆయనకి ప్రత్యేకం రొట్టెలు. స్వయంగా కూర వొండింది. తింటాడో తినడో అని సందేహపడుతుంది; అరవింద నీ విధంగా చూడ్డం గోపాలరావుకి కొత్తగావుంది. ఈమెకి ఇంకొకరి మీద యింత గౌరవముందా అనుకు న్నాడు.

స్టేషన్‌కి మోటారుతీసుకువెళ్ళి, ఆయన్ని తీసుకొచ్చింది. ఆయనపేరు "వాగ్లీ" గారు. సరాసరి యిద్దరూ గదిలోకి వెళ్ళారు. భోజనానికి ముందు ఆమె బైటికొచ్చి అన్నీ సన్నాహం చేసింది. ఆకొత్త ఆయన చాలా పొడుగ్గావుంటాడు. లాగులు వేస్తాడు. సగం మీసం. మొహం తళతళ మెరుస్తో వుంటుంది, వార్నిషుపూసినట్టు. పెద్ద కళ్ళజోడు, పొడుగాటి చొక్కాయి. జాగ్రతగా ఆలోచించి చేస్తాడు ప్రతిపనీ— అన్నం కలపడం, తినడం, మాటమాట్లాడ్డం, కళ్ళెత్తడం,— అన్నీ!

వాగ్లీ వెంకట్రావుగారితో మాత్రమే మాట్లాడాడు. వెంకట్రావుగారు సాధారణంగానే మాట్లాడుతాడు గాని ఆయనమీద యేమీ గొప్పభక్తి చూపలేదు ఆయనకి వేమీ తెలావుండనట్టుతోచింది గోపాలరావుకి.

భోజనమైన తరవాత వాగ్లీ, అరవిందా తిరిగి ఎవరి గదుల్లోకి వాళ్లు వెళ్ళారు. అప్పటిదాకా గోపాలరావు పడు కోనేలేదు.

రెండు రోజుల్లో రవణకూడా వాగ్లీ సేవలో ప్రవేశించింది. ఆఇద్దరు స్త్రీల ముఖానా కొత్తభక్తి, కళ తాండవమాడుతోంది. ఒక్కపూజ చెయ్యడంతప్ప, తక్కిన విషయాల్లో ఈశ్వరుణ్ణి ఆరాధిస్తున్నట్లేవుంది, ఆవాగ్లీ సేవ గోపాలరావుకి. ఆవాగ్లీలో మహాత్మ్యమేమీ కనపట్టంలేదు. ఆ పై చూపులు పెట్టడం, తక్కిన వాళ్ళతో మాట్లాడకపోవడం తప్ప, యింక తక్కినదంతా సామాన్య మానవులమాదిరిదే! భోజనాల సమయాన తప్ప తక్కినప్పుడు వాగ్లీదర్శనం! ఆ ఇద్దరు స్త్రీలకు తప్ప యెవరికీ కాదు. రవణకూడా అతని గదిలో దూరడం మొదలుపెట్టింది. హాలులో రవణ తనని తప్పించుకో లేదనే ఆశలు పోయినాయి వొంటింటిలోనూ వాగ్లీ గదిలోనూ గడుపుతోంది కాలం. రాత్రులు అరవింద కూడా హాల్లో పడుకోవడంవల్ల రవణతో స్వేచ్ఛగా మాట్లాడ్డానికి వీల్లేదు. మాట్లాడినా వినిపించు కుంటుందా? తనన్నట్లా వొదిలి, ఆ వాగ్లీసేవ చెయ్యటమేమిటి? అరవిందకన్నా తెలేనూ! అరవిందతో మాట్లాడాడు ఒకరాత్రి.

మీరేమనుకుంటున్నారో, కాని ప్రస్తావించక వీల్లేదు. మీకూ వాగ్లీగారికీ, స్నేహమో, భక్తో, అది బాగానే వుంది. కాని దీన్నికూడా ఆ పరాయి మొగాడి సేవకి వినియోగించడం మీకు క్రమమైన పనికాదు.''

''వాగ్లీని అట్లా చూడకండి. ఆయన అసమాన్యుడు, పైగా నేనేమీ రవణని ఆయన సేవలో పెట్టలేదు. రవణకే క్రమంగా భక్తి కుదురుతోంది.''

వెంకట్రావుగారికి యీ వాగ్మి మహిమను గురించి సందేహంగా వున్నట్టుంది. అరవిందలో అంత నమ్మకం లేక పోతే యింకా అనుమానించేవారే. భోజనందగ్గర అన్నీ ప్రశ్నలు అడుగుతారు.

"మీకు యోగశాస్త్రంలో పరిచయమున్నదా?"

"కొంతవరకు."

"యోగం నేర్చుకోవడంవల్ల యేం వుపయోగ మంటారు? నేనూ శాస్త్రం చదివాను"

"ఆనందం కోసం."

"ఏ ఆనందం."

"అనుభవించాలి."

"మరి మీరనుభవిస్తారు సరే! ఈ యోగులు లోకానికి యెందుకూ పనికిరాని వారౌతున్నారు, ఏకొద్దిమంది శిష్యులకో తప్ప. తిండిలేక తీరిక లేక, రోగాలతో విచారాలతో, మృత్యువు లోకం యిట్లా తల్లడిల్లుతో వుంటే, శ్రమపడక, బాధలు పంచుకోక, ఆత్మానందమని ముక్కు మూసుకుని మూల కూచుంటే, న్యాయమా?"

"లోకమంతా తల్లడిల్లుతోంది. తల్లడిల్లకుండా ఎవరు చెయ్యగలరు? ఈశ్వరుడు కూడా చెయ్యలేడు."

"చెయ్యలేకేం? క్రిస్టియను మిషనరీలు చూడండి ఎంత దూరం వొచ్చి కాలేజీలు ఆస్పత్రులు పెట్టి. ఎంత బాధనివారణ చేస్తున్నారో!"

"మతంకోసం చేస్తున్నారు. చక్కెరపూతమాత్ర."

"ఏ వుద్దేశ్యంతోనైతేనేం. వాళ్లు చేసే పనిచూడండి. ఈయోగులందరూ ఆ పని చెయ్యకూడదూ! యోగులేకాదు. వాళ్ళదగ్గిర్నించి యీ ప్రజలందరూ నేర్చుకున్నారు ఎవరి ఆనందం వాళ్లు చూసుకోడం."

"కాని యీ మిషనరీలు-ఎంత మాత్రం బాధని తొలిగించారు? కాలేజీలు పెట్టారు, పాఠాలు చెప్పారు, రోగాలు నయం చేశారు. కాని ఆనందంకాని, శాంతికాని యివ్వగలిగారా? మళ్ళీ రోగాలు రాకుండా చేశారా? కర్మ పరిపాకాన్ని తగ్గించారా?"

"కాని తాత్కాలిక సహాయం చేశారా, లేదా?"

"ఆ మాత్రం చేసేమి చెయ్యకేమీ? కర్మానుభవం యెవరూ తప్పించలేరు ఎవరికి వారేగాని ఒకరి కింకోరు యెవరూ సహాయం చెయ్యలేరు. అసలు ఆకలి కాకుండా మార్గం నేర్పాలిగాని, ఒక అరటిపండు, అప్పుడప్పుడు పెట్టి లాభమేమిటి?"

"యోగం కర్మని ఛేదిస్తుందా?"

"కర్మలో బాధలు అంటనంత ఆనందముంది."

"మరి అందరికీ చెప్పరాదూ?"

"అందరికీ సమర్థత వుండదు. పాత్రతవుండదు."

"ఇట్లా బాధపడవలసిందే?"

"ఆ"

"ఏమో! నా మనసుకి, సుఖంగా తిని కూచునేవాళ్ళ వేదాంతంలాగు తోస్తుంది, యీ కర్మ వ్యవహారం. మరి అంతా కర్మైతే ధనానికీ, కీర్తికీ, ప్రజలెందుకీ ప్రయత్నాలు!"

"మూర్ఖం."

"బి ఏ. ప్యాసు అయ్యే గీతవుంటే, చదవకుండానే అవుతాడా!"

"చదవనివాడైతే ఆ గీతే వుండదు."

"ఆకలి వేస్తే, అన్నానికి ప్రయత్నం చెయ్యరా!"

మూర్ఖం. ప్రయత్నంవల్ల వొస్తుందా! నీళ్ళు, గాలి, భూమి, విత్తనం, భోజనం, జీర్ణం—యీ శక్తులన్నిటికీ పరస్పర సంబంధం సృష్టిలో లేనిది, నీవెంత ప్రయత్నం చేసి ఏంలాభం? అది మాయ, మూఢత్వం."

ఈ వేదాంతం చూస్తే వెంకట్రావుగారికి చాలా మంట.

"మరి యీ సంఘ సంస్కరణం, యీ రాజకీయ యుద్ధం, యీ 'ఎకనామిక్' బాధలు, యివన్నీ యేమిటి?"

"చంటిపిల్లల ఆటలు! ఎప్పుడు పెళ్ళైతేనేం, ఎవరు పాలిస్తేనేం!"

"దేశం దరిద్రావస్థలోకి పోతోవుంటే—"

"ఆత్మసౌభాగ్యం వుంటే—"

"తిండి!"

"ప్రాప్తం వుంటే వొస్తుంది."

అతన్ని భోజనానికి పిలవక ప్రాప్తం వుంటే వొస్తుం దని అనాలని పించింది, గోపాలరావుకి.

అరవిందకీ వాగ్లికి స్నేహం యెక్కువగా వుంది. అర్ధ రాత్రిదాకా తిరుగుతారు. రహస్యాలు మాట్లాడుతారు. వాళ్ళచూపులే అసహ్యంగా వున్నాయి గోపాల్రావుకి. అర వింద రమణని చాలాసార్లు పిలుస్తుందిగాని రమణకి వెళ్ళాలని యెక్కువ కుతూహల మున్నట్లులేదు. వాగ్లితో స్నేహం చెయ్యొద్దని అరవిందతో చెప్తే! నవ్వుతుందో! నోరు ముయ్యమంటుందో! వెంకట్రావుగారితో చెప్తే! ఆయనా అంతే! ఇంద్రజాల లోకంలో వున్నట్టుంది అతనికి. ఈ యింట్లో ప్రపంచంలో ఎక్కడా లేని సంగతులున్నాయి. వీడెవడు? వీడితో ఆడపిల్లల్ని తిరగనియ్యడమేమిటి? అందులో ఇంకోడి భార్యని! ఏదపుణ్యమో, ఏదిపాపమో తెలీకుండా ఉంది.

ఒకరోజు మధ్యాన్నం అరవింద. ఎర్రని కళ్ళను తుడుచుకుంటో వాగ్లిగదిలోంచి వొచ్చింది. వ్యవహారం అంతమయిందేమోనని ఆశపడ్డాడు గోపాలరావు. కాని రాత్రి మూడింటిదాకా యింట్లోకి రాలేదువాళ్ళు. రమణ వొక్కత్తే హాలులో పడుకునివుంది. లేపాలనివుంది. కాని అరవింద యే నిమిషాన వొస్తుందోనని భయం. మంగమ్మ ప్రక్కగది లోనించి రావొచ్చు. కాని వాళ్ళేమంటారు! రమణ సరదాగా మాట్లాడుతోవుంటే పరవాలేదు. కాని వెంకెతనం చేస్తే

నవ్వుబాటు తన దగ్గిరికి రావాలని రవణకి వుండదా? తన వలె సిద్ర మేలుకుని వుండదుకద! కానీ!

దగ్గరికి వెళ్లి చూస్తూ నుంచున్నాడు వొక్క నిమిషము. బుగ్గల్లో రక్తంచిమ్మి, నుదిటిమీద వెన్నెల మెరుస్తూ, అందంగా, శాంతంగా, చిరునవ్వుతో పడుకునివుంది. లేపాలి. ఎవరన్నా వొస్తున్నారేమో! దీపంమల్లే యీ వెన్నెలని కూడా ఆర్పడానికి వీలుంటే బావుండును! కిటికీ ముయ్యాలంటే అన్నీ అద్దాల తలుపులు!

ధైర్యంచేసి బుజం పట్టుకుని వూపుంచాడు. రవణలేచి యిటూ అటూ చూసింది.

"ఎవరూ లేరు. నేనే!"

'వాళ్ళు చూస్తారేమో! అరవింద యేదీ!"

"ఆయనతో ఎక్కడో తిరుగుతోంది... రా యిట్లా కూర్చో."

"వాళ్ళు చూస్తారు. ఎవరన్నా వస్తారు."

"ఎన్నాళ్ళిట్లా! రానిద్దూ! ఎవరన్నా రానీ మనకేం భయం! అబైట వాళ్ళకే లేనప్పుడు!"

"వాళ్ళ కెందుకుండాలి! ఏం తప్పు!"

"మనదే నన్నమాట తప్పు!"

"తప్పేమిటి లెండి! కాని వాగ్లి గారిని చూస్తే మీ కెందు కంత కోపం? ఆయన మహాత్ముడు."

"ఏమిటా మహాత్యం!"

"చెప్పడానికి వీలులేదు."

"నువ్వట్లా ఆ గదిలో వుండవొద్దు. బావుండదు."

"అదుగో, మళ్ళీ అనుమానం. ఆయన చాలా సత్పురుషుడండీ, మీకు తెలీదు!"

"నాకిష్టంలేదు."

"కారణం లేకుండా యిష్టంలేదంటే, ఎట్లా!"

"నాకిష్టంలేని పనులు నువ్వు చెయ్యకూడదు"

"మరి నేను అన్నం తినడం, మాట్లాడ్డం, అసలు బతకడమే మీ కొకవేళ యిష్టంలేకపోతే—"

"ఇదీ అదీ యెట్లా వొకటవుతుందేం?"

"అట్లానే వుంది."

"కాని నువ్వు వెళ్ళవొద్దు. సరేనా?... ఇంకా దగ్గిరిగా కూచో,—ఎప్పుడూ యిట్లా కూచోరాదూ, నా దగ్గిరికి రావాలని ఉండదూ? వుంటే మరి రావేం?

"మీకూ యోగం తెలుసా!"

"తెలీదు."

"యోగం తెలిసిన వాళ్ళకి అసాధ్యం యేదీ వుండదటగా!"

"అన్నీ కబుర్లు"

"నిజమేనండీ. నేనూ మొదలుపెట్టాను."

"వాడిదగ్గిర యోగమా! వెంటనే మానేయి."

"ఎట్లా మానను? నేర్చుకుంటానని చెప్పి!"

"నా కిష్టంలేదను."

"వాళ్ళు నవ్వుతారు."

"ఏమన్నా కానీ వీల్లేదు."

"మరి నేర్చుకుంటానని వాగ్దత్తం చేశాను."

"చెయ్యడానికి వీల్లేను."

"చేసేశాను."

"నన్నడగంది వీల్లేదు."

"ఏమో చేశాను. ఎందు కడగాలి!"

"అహా, మంచి బుద్ధులు నేర్చుకుంటున్నావే! చాలు గాని వెడదాం పద, వెంకన్నపంతులుగారి దగ్గిరికి."

"నేను రాను. వాళ్ళింటో అడుగు పెట్టను."

"నేను వెడుతున్నాను. నువ్వూరావాలి. నేను చెప్పి నట్లు వినాలి. వినాలా లేదా?"

"వినాలి లెండి. కాని నేను చేసిన వాగ్దత్తాలు వాదులుకో మనడానికి వీల్లేదు. నిష్కారణంగా మళ్ళీ ఆ వెంకన్న పంతులింటో నన్ను పడేసి మీకోవన మీరు వెళ్ళడానికి వీల్లేదు. కావలిస్తే మీతో తీసికెళ్ళండి. యిక్కడ వుంచి, పోతారా? అదీ మీయిష్టమే! నాకెక్కడ సౌఖ్యంగా వుంటే అక్కడ వుంటాను."

"వీల్లేదు. మితిమీరిపోతున్నావు. నే పోతా."

"నేనూ వస్తాను."

"నేను మీా పెదనాన్నగారి యింటికెళతాను."

"నేను రాను."

ఇంకేమంటాడు. ఏమయ్యేదో; అరవింద వొచ్చింది.

"అదీ, చక్కగా మాట్లాడుకోవాలిఅట్టా. లేవకు. నేను అమ్మగదిలో పడుకుంటాను."

"వొద్దు. ఇక్కడే పడుకో."

రవణ వాలకం చూసింది అరవింద.

"ఏడిపిస్తున్నాడా నిన్ను! సరేలే, స్త్రీలజన్మ యింతే" అని పడుకుంది.

౧౧

మర్నాడు వెంకట్రావుగారితో మాట్లాడాడు గోపాలరావు తెగించి.

"మీా అభిప్రాయాలు ఎట్లున్నా అరవింద నాకు చెల్లెలతో సమానం. ఆమె అపాయంలో వుంటే నేను సహించలేను. అతను మంచి మనిషి మల్లే నాకు తోచటంలేదు. మీారు కొంచెం జోక్యం చేసుకోకపోతే, వ్యవహారాలు ముదురుతాయి."

"ముదిరే దేముంది! ఇష్టమైతే పెళ్ళి చేసుకుంటారు."

"మరి ఆయన యోగిగా!"

"ప్రేమ కుదిరేవరకే!"

"కాని సంబంధం మంచిదేనా!"

"దాని యిష్టం. దానికి నచ్చితే సరి!"

"మరి మీ సలహా!"

"కావలిస్తే అడుగుతుంది."

"పెళ్ళి ఆయన వుద్దేశ్యం కాదేమో!"

"అది అరవింద కనుక్కుంటుంది."

"అంతా అట్లా ఆడపిల్లమీద వొదిలెయ్యడం మంచిదికాదు"

"సరేలే."

"రవణకూడా ఆయనదగ్గర యోగాభ్యాసం మొదలు పెట్టిందట! మరి ఆయన నాతోనన్నా, మీతోనన్నా చెప్పకుండా—"

"భార్యమీద భర్తకి హక్కువుందని వొప్పుకోడేమో ఆయన! ఎందుకడగాలి? అంటాడు."

"మరి నేను హక్కువుండాలంటున్నానుగా—"

"ఆయన వొప్పుకోడు. రవణని వెళ్ళనీకు."

"ఎట్లా? మీ అమ్మాయితో స్నేహం—పోని నేను వెళ్ళిపోతాను' దాన్ని తీసుకొని."

"ఎక్కడికి?"

"వెంకన్న పంతులుగారి దగ్గిరికి."

"రవణ వొస్తానంటుందా!"

"రవణ యిష్టమేమిటి! ఇల్లాంటి వూహాలతోనే యీ పిల్లల్ని చెరుపుతున్నారు. లేకపోతే యెవరో కొత్తవాడికి యీ సొతంత్ర మేమిటి? ఆ మాటలు, ఆ షికార్లు—"

"సరేలే. నేను చూస్తాలే."

"వెంకట్రావుగారికి కూడా యీ వాగ్లీ వ్యవహారం నచ్చడం లేదు," కూతుర్ని పిలిచాడు.

"నా కెందుకో యీ వాగ్లీని చూస్తే నమ్మకం కలగటం లేదు."

"ఆయన అభిప్రాయాలు వేరు, మీవి వేరు."

"అంతమాత్రాన నాకు అయిష్టం కలుగదు. నీకూ అతనికీ వున్న స్నేహం సంగతి. అతని సంగతి నీ కెంతవరకు తెలుసో, నాకు తెలీదు. కాని జాగ్రత్తగా వుంటే మంచిది. అందులో ముఖ్యం. ఆ అమాయకురాలు రవణనికూడా దించుతున్నావు—"

"ఏమిటి నాన్నా. అట్లా మాట్లాడతారు! వాగ్లీ సంగతి మీ కేమీ తెలీదు. అతను సామాన్యుడు కాడు. ఎన్ని మహిమలున్నాయో మీకు తెలీదు."

"అంత ఎక్కువ గౌరవ మున్నప్పుడే విచక్షణాజ్ఞానం పోతుంది అతనుపోతే బావుండు ననిపిస్తుంది."

"పంపించెయ్యమంటారా!"

"వీలైనంతవరకు కళ్లు తెరుచుకుని వడు."

"ఏమీ పరవాలేదు నాన్నా."

"రెండు రోజులు తరువాత ఓనాటి రాత్రి అరవింద మోటారు తెప్పించి, సముద్రం దగ్గిరికి షికారు వెళుతున్నామంది. రవణని పిలుస్తోంది. గోపాలరావు చీకట్లోంచి వింటున్నాడు రవణ రానంటోంది; అరవింద తప్పక రావాలంటుంది. చివరికి వెంకట్రావుగారుగాని గోపాలరావుగాని వొస్తే వొస్తానంది.

"గోపాలరావుని చూస్తే పడదు వాళ్లికి. ఐనా అడిగి చూస్తాను."

వాళ్లి దగ్గిరికి వెళ్ళింది. మళ్ళీ గోపాలరావు దగ్గిరికి వొచ్చిఅడిగింది.

"నే నెందుకూ! రాను."

"రావాలి. సరదాగా వెడదాం, రాండి."

"నాకేం సరదా లేదు."

తన మొండితనం చూసి అతనికే ఆశ్చర్యంగా వుంది.

"అయినా రావాలి నాకోసం!"

"మీకోస మేమిటి!"

"మీరు రాంది రవణ రాదు"

"మంచిది, పోనీండి."

"నే నొక్క దానినా? బావుండదు"

"నే నేంచెయ్యను? ఇదొక్కటేనా బావుండంది?"

అరవింద కళ్ళల్లోకి నీళ్ళొచ్చాయి.

"నన్ను గురించి మీరు అన్యాయంగా తప్పు భావిస్తున్నారు. మీకే తెలుస్తుంది. రారూ."

మెత్తపడ్డాడు. నలుగురూ కోటదగ్గిరికి వెళ్ళారు. అరవిందా, వగ్లీ కాలవ లాకుల దగ్గిరికి వెళ్ళారు. రవణా గోపాలరావూ కోట చివర నుంచుని సముద్రంకేసి చూస్తున్నారు. వెన్నెల వొచ్చీ, పోశో వుంది. రవణ తన మొహాన్ని గోపాలరావు 'ట్వీడ్' కోటు బుజాల వెనక దాచుకుని నుంచుంది. సముద్రపుగాలి రవణ జుట్టుని మొహం చుట్టూ వూపుతోంది. చంపని బుజాని కానించి రెండుచేతులతో అతని జబ్బల్ని పట్టుకుని. మొహంకేసి చూస్తో నుంచుంది. ఆమె బుజంమీద చెయ్యేసి ఆమె కళ్ళ ల్లోకి చూశాడు ఇంక యెప్పుడూ తనమాట వింటుందా? ఈ పిల్లతో సంసారం చెయ్యబోతున్నానా అనుకుంటున్నాడు గోపాలరావు. ఇతనికి తనమీది కోపం పోయిందా, అనుకుంటోంది రవణ.

రాత్రి కొంగలు అరుస్తున్నాయి సముద్రం నీళ్ళదగ్గిరినించి.

ఆ కోటమీద నుంచుంటే, గోపాలరావుకి, తాను యీ ప్రపంచానికీ రవణ హృదయానికీ అధిపతి అయినట్టు

తోచింది—బొచ్చుకోటూ, చప్పిదవదలూ, పీచుజుట్టూ వున్న గోపాలరావుకీ, రవణ తనంతటతాను అతని వీపుమీద చెయ్యి వెయ్యగానే, లోకంలోని అభిమానబలం, శక్తి, కొత్త వుత్సాహం, గర్వం కలిగాయి. లోకానికంతా తాను నీచమైనా, యీ హృదయరాజ్యానికి తాను అధిపతి. ఇంకేం కావాలి ? ఆ ఆధిపత్యంకూడా నశిస్తున్నట్టు కనుపడ్డది ఒక్క నిమిషం. అందుకనే, ఏమైనా వొదులుకోగలరుగాని, భార్య హృదయాన్ని వొదులుకోలేరు పురుషులు.

వాళ్లి, అరవిందా, ఒకరిమీద ఒకరు చేతులు వేసుకుని లాకుల దగ్గిర కనబడ్డారు.

''వాళ్లచూడు ! పెళ్ళికాకముందే యెంత స్వేచ్ఛగా ఆనందంగా తిరుగుతున్నారో !''

"కాని నువ్వు ఒప్పుకోవుగా !''

''మీరు ముందు ఆయనమల్లే స్వతంత్రంగా వుండండి. ఎవరికీ భయపడక !"

''ఏంభయం—డబ్బుం చేసరి!"

"డబ్బెందుకు !''

"ఎన్నిసార్లు నిన్ను బైటికిరమ్మని పిలిచాను!''

వాళ్ళ సంగతి మాట్లాడ్డం రవణకి యిష్టంలేనట్టుంది. ఎందుకో! వాళ్లు దగ్గిరికి వొచ్చారు.

"పడవలో షికారు వెడదాం రండి."

గోపాలరావుకి రవణతో మాటాడాలని వుంది."

"మేము రాము. మీరు వెళ్ళండి."

"పోనీ, రవణా నువ్వన్నా రా ?"

"అయినో !"

"మరి ఆయన రారుట. రా" అని,

అరవింద రవణని తీసికెడుతోంది.

ధైర్యముంటే అక్కడే రవణని నరికివేసును అతను. చేతులు తిమ్మిరెత్తాయి ఇంక వోర్చుకోడం కష్టం.

"నేను చెప్తున్నాను విను. వెళ్ళవొద్దు."

అతని కంఠంలోని కొత్తబాధని కనిపెట్టింది

"సరే, వాళ్ళతో చెప్పి వొస్తాను."

వెన్నెట్లో దూరంగా నడిచిపోతోంది. ఆమె అందాన్ని చూసి, కారులో కూచోపెట్టుకోవాలనిపించింది. అంత అందాన్ని చూసివాగ్లి వూరుకుంటాడా?

రవణ వాళ్ళదగ్గర నుంచుని రానంటోంది. వాగ్లి యేదో అంటున్నాడు. అరవింద యేదో అంది. రవణ తల వూపింది వల్లకాదని. బలవంతాన అరవింద రవణచేతిని పట్టుకు లాక్కుపోయింది ఆమె వెనక్కి తిరిగి

నేనే బలవంతంగా లాక్కెడుతున్నాను. రవణ తప్పేమీలేదు" అని కేకేసింది.

"గోపాలరావు జన్మలో అంత బాధ నెప్పుడూ అనుభ వించలేదు. ఎందుకు కావలసినవాళ్ళు తన రవణని లాక్కెడు తున్నారు! వాళ్ళకేం అధికారం! చెయ్యిపట్టుకు లాగితే మాత్రం, రవణ ఎందుకు వెళ్ళాలి? అని తర్కించుకొని, బాధపడ్డాడు. వాళ్లు వొచ్చిందాకా ఎట్లా కాలం గడపడం! ఇంతబాధ ఎట్లా వోర్చుకోడం! ఉన్నవీ లేనివీ, జరుగు తున్నట్లే తనకి తోస్తాయే!

పరుగెత్తాడు రవణని తీసుకురావాలని ఏరుమధ్యకు వెళ్ళింది పడవ. పడవలో రవణ ఆతురతా, పడవని వెనక్కి తీసుకెళ్ళమని వాళ్ళని అడగడం, అవన్నీ అతను చూడలేదు. అట్లానే చూస్తున్నాడు. అరవింద పడవబల్లమీద వెల్లకిల పడుకుంది. వాగ్లీ తెడ్డేస్తున్నాడు. అతని పాదాలదగ్గిర కిందగా కూచునివుంది రవణ.

వెనక్కి నడిచాడు. ఆ మోటారు తాకాలని బుద్ధి వెయ్యలేదు. తానింటికిపోతే! డ్రైవరిస్తే లేవి తీసుకుపోమ్మంటే! వాళ్లింటేనేకాని రాదు. నడవాలనుకుని వెనక్కి బయలు దేరాడు—

వాగ్లీ తెడ్లువేస్తో పూగుతో వుంటే, రవణ బుజాలు అరిసి తాళ్ళని అనుకున్నట్టే కనపడుతోంది అతనికి దోవ పొడుగునా!

అందరు భార్యలూ సుఖంగా భర్తలతో కాపరాలు చేస్తోవుంటే తనకీ ఖర్మం పట్టిందేం మొదటినించీ! ఈ సంఘ సంస్కరణం పెళ్ళివల్ల వొచ్చింది. స్త్రీని బానిసగావుంచే పాత చట్టాలలోంచి క్రొత్త స్వేచ్ఛలోకి కళ్ళు తెరవడానికి ప్రయత్నించే తన హృదయం పడుతున్న మెళుకువు "బాధ" అని అతనికి తెలీదుకదా !

రవణని ఏంచేస్తున్నారో ! బాధ పడుతోందేమో. యిష్టంలేక. అంతేకావాలి. కాని రవణకేం ! బాధంతా తనకే ! ఏమీ యెరగని తనకి, ఈ రవణని వొదిలి వేరే పెళ్ళిచేసుకుంటే తీరిపోతుంది.

## ౧౨

అతను యింటిగుమ్మంలోకి వెళ్ళేప్పటికి వాళ్ళ మోటారు వొచ్చింది. మబ్బులన్నీ పోయినాయి. వెన్నెల మెట్లమీద తెల్లని పరుపు పరచినట్లుంది. వాళ్ళకి కనపడడం యిష్టంలేక పక్కచెట్లనీడలో నుంచునాడు. దిగగానే ముందు రవణ లోపలికి వెళ్ళింది. తనని వెతుక్కుంటోందని తెలీదతనికి. తరువాత మెల్లిగా వాళ్ళిద్దరూ వెళ్ళారు. అరవిందకూడా హాల్లోకి వెళ్ళింది. వాళ్లీ గదిలోకి పోయినాడు. వాళ్ళిద్దరూ నిద్రపోతేనేగాని తాను పడుకో తలుచుకోలేదు. పదినిమిషాల్లో

రవణ వరండాలోకి వొచ్చి నుంచుంది. తనకోసమే తాను పారిపోయినానన్నో, చచ్చాననో. అనుకుంటో వుంటుంది. అంతే కావాలి. వైధవముండై అందరిచాతా తన్నులుతిని— పురుగులుపట్టి, తనని తిలుచుకోని యేడవాలి! తనదగ్గిర్నించి లాక్కునిపోయిన వాళ్ళని శరణు చొచ్చమనా, యెంతమాత్రం లాలిస్తారో!

"ఇట్లారా."

రవణ అదిరిపడి చూసింది. తొరగా వొచ్చింది.

"అమ్మా! యిక్కడ వున్నారా! పడుకోరేం?"

అతని బుజంమీద చేతులు వేసింది. తనని మరిపించడానికి, మోసపుచ్చడానికి ఎన్ని టక్కులున్నాయి దీనిదగ్గర. పై నించి వెన్నెల ఆమె బుగ్గలమీద ఆటలాడుతోంది. ఆమె చేతులు బుజాన్ని కరిగిస్తున్నాయి. కాని గుండె రాయిపడ్డది.

"ఎవరునువ్వు? నేనెవరు? పో. నామాట వినని దానివి. వెళ్ళు వాళ్లదగ్గిరకే. పో, పో. ఆ గదిలోకి-పో. వాడే నీ మొగుడు."

రవణ నిర్ఘాంతపోయినట్లు భయంతో చూసింది.

"అరవకండి. ఆయనకి వినపడతాయి."

"ఆయనకేనా? మీ ఆయనకి? వినపడనీ ఏంచేస్తాడేమిటి? వెళ్లు వొంటరిగా వున్నాడు."

రవణ అతని నోరు మూసింది.

"అయ్యో, వుండండి."

విదిలించుకున్నాడు.

"ఒకటేమాట. నా మాట వింటే విను, లేకపోతే నీ దోవ నీది నా దోవ నాది - అడ్డమైన మొగాళ్ళతోటీ—"

రవణ వెళ్ళిపోతోంది.

"ఆగు, విను."

"నేను వినను వెళ్లండి"

తను వెళ్ళమంటే, బతిమాలడంలేదు సరికదా; తనను వెళ్ళమంటుందా! పరిగెత్తి వెళ్ళి జుట్టుపట్టుకున్నాడు.

"నేను పోవాలంటే తప్పదుముండా! నేను పోతే, వాడితో లేచిపోతావా!"

తన్నాడు. జుట్టుపట్టుకు యీడ్చాడు. ఒక్కమాట మాట్లాడక, కిక్కురుమనక, ఎదురు తిరగక నిలబడ్డది. సిగ్గేసి భయమేసి వొదిలాడు. ఎదురుగా నుంచుంది. వెన్నెలలో ఆమె రొమ్ము వూగుతోంది. జుట్టు వూడింది.

తలుపు తెరుచుకొని వాగ్ని వొచ్చాడు. సరిగా యెదురుగా గోపాలరావు దగ్గిరికివొచ్చి, పిల్లి యెలికను యెత్తినట్లు యెత్తి అటూ యిటూ వూపాడు.

"ఆడదాన్ని పట్టుకుని కొడతావురా! నీ బతుక్కి నీకో పెళ్ళాం వుందికదా అని——"

కిందపారేసి అతన్ని నుంచున్నాడు. ఒక్కతన్ను తన్నడానికి కాలెత్తాడు. రవణ అడ్డమొచ్చింది.

"నీకెందుకు? అన్నాడు గోపాలరావు.

"నాకెందుకా నాకెందుకా! ఎందుకో తొరలోనే చెపుతా - ఆ పిల్ల వొంటిమీద చెయ్యి పడ్డదంటే! యీ లోపున, చూసుకో!"

"ఏమిటి చూసుకో? ఇక్కడ యీ యింట్లో వొక్క తుణముంటానా? వెళ్ళిపోతున్నాను"

"వెళ్ళు మాకేం! రవణా రా"

"రవణ! నా ప్రాణముండగా రాదు."

"రాదూ! రా, రవణా!"

ఒక చేత్తో రవణని దగ్గిరిగా లాక్కున్నాడు. వొదిలించుకోడానికి ప్రయత్నించింది. కాని వొదల్లేదు.

"వెళుతున్నావుటే ! వాడితో పోతున్నావుటే...
ముండా, ఏమీ ?"

మాట్లాడలేదు. గోపాలరావు భీకరంగా మీాదికి వొస్తు
న్నాడు. వాగ్లీ వెనక్కి వొదిగింది అదిచూసి మరింత మండి
పడి మీాద నూకాడు సులభంగా వాగ్లీ ఒకదెబ్బ కొట్టాడు
దవడమీాద. గోపాలరావు దిమ్మతిరిగి కిందపడ్డాడు. రవణ
అరిచి పెనుగులాడ్డం చూడలేదు.

"వుండండి"

"రవణా, రవణా, నీకేం భయంలేదు. నేను రక్షిస్తాను.
వాణ్ణిపోనీ, నీకు యోగం నేర్పుతాను. నిన్ను దేవత్వాని
కెత్తుతాను. ఈ నీచుడితో నీకేమిటి ? రా, నూవ్వూ నేనూ
వొకరి కొకరం సృజింప పడ్డాము"

"పోవే-పోవే. వాడితోనే పోవే."

"అనుగో-చంపుతా మాట్లాడావంటే"

"ఓసే-నన్ను చంపి నిన్ను పెళ్ళాడతాట్టే ! పెళ్ళెందు
కాడతాడు ! వుంచుకుంటాడు—ఈ యోగే నిన్ను—"

"నోరు ముయ్యరా,"

తన్నడానికి దగ్గిరికి వెళ్ళాడు.

రవణ చప్పున అతన్ని వొదిలి గోపాలరావుని కావి
లించుకుంది. 'నన్ను తన్నండి"

"రవణా లే."

"నేను లేవను. మీరు వెళ్ళండి."

"ఇదేమిటి ! మన ఆలోచనలన్నీ యేమైనాయి !"

"ఏం లేదు. అదంతా చెడ్డకల. వెళ్ళండి."

"పడవలో ఏమన్నావు !"

"ఏమంటే నేం!"

"వాణ్ణి వదిలేసిరా, మాట్లాడుదాము."

"ఈయనతో ముందు మాట్లాడాలి."

"మళ్ళీకొట్టావా " అంటో వాగ్గి వెళ్ళాడు.

గోపాలరావు తలని రొమ్ముకి గట్టిగా అదుముకుంది. చాలసేపు గోపాలరావు మాట్లాడలేదు.

"వాడితో వెడతావా !"

"ఛీ. యెందుకు వెడతాను !"

"నామాట వింటావా !"

"ఏం చెప్పినా వింటానండీ!"

"ఏం చెయ్యమన్నా !"

"ఏం చెయ్యమన్నా సరే! మీ పాదసేవ చేసుకు బతుకుతాను మీరే నా తండ్రి, నా దైవం."

చంద్రుడస్తమించాడు.

*  *  *

మర్నాడు వెంకట్రావుగారు గోపాలరావు దగ్గిరికి వొచ్చి రూపాయలిచ్చి, "నువ్వూ రవణా పట్నంలో కాపురం పెట్టండి నేను డబ్బు పంపుతాను. ఇంకా శెలవలు పదిహేను రోజులున్నాయి. ఇల్లూ అదీ చూసుకోండి. ఇదివరకే పంప వలసింది నేను" అన్నారు.







# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA116B119 |
| పుస్తకం పేరు | వివాహం |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 125 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | KDaveed |
| పేజీలు విడదీసినది | KDaveed |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |